# విశ్వనాథ పంచశతి



విశ్వనాథ సత్యనారాయణ

# విశ్వనాథ పంచశతి

విశ్వనాథ సత్యనారాయణ.

# అంకితము



## శ్రీ॥ శ్రీ॥ కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారికి

అధునాతన సంస్కృతికిని
ప్రధానబీజమ్ము నీవు పాండిత్యపయో
నిధి నీవు మార్గదర్శక
సుధారుచివి నిన్ను మఱవఁజొచ్చిరి యాంధ్రుల్.

ఆంధ్ర విజ్ఞానసర్వస్వ మద్ది నీవు
మొదలుపెట్టితి మా కది కుదురలేదు
ఆంగ్ల విజ్ఞానసర్వస్వ మట్లు దాని
వెలయఁజేయుము క్షమియింపవే! మహాత్మ!

నీ రచిత వ్యాసంబు లు
దారంబగు నీకు నాత్మదర్పణముల్ నీ
సారమతి ముద్రగల్గిన
యారంభంబులగు విజయ మగుత మహాత్మా!

సంఘ సంస్కారభావ మిశ్రమముగాని
యచ్చ సంస్కృతి నీ యాత్మయందె వెలిఁగె
యచ్చ సంస్కృతి తెలియని యాంధ్రజాతి
యాధునిక మిది పలుత్రోవలై చలించు.

ఉర్విలోన మహాకవి యోగినంటె
వాఁడు సర్వమ్ము భావనావధిగఁ జూచు
నల్పులంబోతె బ్రతుకులో ననుభవించె
ననుకొనుట వట్టి పామరమైన యూహ.

ఒకరిమీఁదఁ గోపమ్ము లే దొకరిమీఁదఁ
బ్రేమ లే దూరక పురస్కరించును గవి
యౌర! యీలోక మిది చమత్కారమయము
ఎల్ల కాలంబులందున నెల్లచోట్ల.

# విశ్వనాథ పంచశతి

ఏకసటుండై ప్రకృష్టసాహిత్య మొప్పి
సర్వవిఘ్న ప్రతారణ జర్జరుండు
'నందమూరున' నన్నపూర్ణాంబికా స
నాథుండై నెలకొను విశ్వనాథ శివుండు.

కొన్ని వ్యంగ్యముల్ ధ్వనులును గొన్ని వట్టి
వర్ణనలు కొన్ని రమణీయ వాచ్యసరణి
బహువిధంబుల వ్రాసెదఁ బంచశతి న
త్యార్తి హరుని విశ్వేశ్వరు నంజలించి.

ఒకకంట సున్నమును వే
ఱొక కంటఁ బెల్ల మన్న యొప్పుగ సూర్యుఁ
డొకకన్ను తుహినకిరణుం
డొక కన్నిక లోక మెట్టు లుండును తండ్రీ!

ఒకచక్రము మేడ మరిం
కొక చక్రము గుడిసె బండి యొడుదొడుకు కలుగ న
న్నిక బోల్తాపడుటయు గతు
కుడు పడుటయు సాఁగుటయును గూలఁబడుటయుఁ.

ఇంత ముద్దుతోడ నెంత రోసమ్మైన
నొప్పఁగలుగు శక్తి యమరియుండ
తీరి యింతవఱకుఁ దెప్పించవచ్చును
రాదటంచు లెక్క యేది? నీకు.

పోరులాడి భార్యఁ బుట్టింటినుండి తీ
సికొనివచ్చి రైలుస్టేషనందు
నువిద, మగఁడు, ప్రేమయును గోపమును దోఁపఁ
జూపు లొకరి నొకరు చూచుకొనిరి.

మనయింటి కెదురుగా నుం
డినవారల కూఁతునకును సహజముగఁ దేల్క-
ట్టిన దని యడిగి తెలిసికొని
వనరుట నీ జాలిగుండెవలననె ప్రియుఁడా!

వానికి సంఖ్యాశాస్త్ర
జ్ఞానము మిక్కిలి పరీక్ష 'నంబరు' తనకుఁ
గాని దని మిగులఁ జదివియు
హాసిసి శంకించి, యప్పుడె 'హాలును' వేసెఁ.

గడుసులు నాయకు లని పే
ర్వడసి కులములందు దేశభాగములందున్
గడనకయి కీర్తికయి యవి
విడివిడి వసి ద్వేష మెట్లుఁ బెంచు గలఁతులన్.

ఓయి! మనసుకాడ! యొకవేళ సాహస
మ్మాచరించె దేని ఆచరింపు
పరువు గలిగినట్టి పడతులయెడలఁ, గా
దాయె నేని అవ్వ యనుచు లేదు.

ప్రక్క-యింటికి మఱి కొత్తవార లెవరొ
యద్దె కరుదెంచి రంచుఁ బూ లడుగఁబోయి
వానరమువోని యా మగవానిఁ జూచి
లేమ పూ లడుగంగఁబో లేదు మఱల.

సూర్యుఁ డెఱ్ఱనిసంజయుఁ గొంత తెలుపు
తిరుగు శశితోడ పడమటిదిశ సెలంగె
కోపము ప్రసన్నతయు రెండుకూడ మగనిఁ
గలియఁజేరంగఁ జను కులాంగనయుఁబోలె.

గొప్పవారలు మఱి వారుకూడ నిట్లె?
అనెద వేటికి? నా గొప్ప యనఁగ నెందు?
చదువు ధనమును నధికారసరణియందు
కామమును క్రోధమును శాంతి గనుటఁ గాదు.

అతఁడు పరదేశ కవిగ్రంథ మందుకొనిన
గుణములే గుణమ్ములు దాఁచికొనఁగలేడు
అట్లనె స్వదేశకవి గ్రంథ మందుకొనిన
మఱియుఁ గనవలె వాని విమర్శశక్తి.

కార్యమైనపిదపఁ గమలాక్షి ప్రియభర్త
తన్నుఁ జూడరాఁగఁ దడసినంతఁ
బూలుకోసి తెచ్చి ప్రాయి రాఁజేయంగ
నుప్పు నుప్పు మనుచు నూఁదుచుండె.

మీ యింటను మా యింటను
వేయిజనము నిండి గొల్లవేళల నుండెన్
నీ యా చూపులు నీటం
బోయెదు సాసనమును చాల బోసినయట్టుల్.

అట దోఁటవారి బాలిక
యటు నిటు కన్నెత్తిచూడ దరిగెడువారిన్
చిటికె వినిపించుకోఁ డ
కుటిలాలక మగఁడు నవ్వుచుఁ జూడంగన్.

నేను కెంత సిగ్గు లేదు, నా యెదుట న
దేమి చూపు మరి య దేమిమాట
కొలత కైన నంత మీమీఁద నుండిన
వచ్చి భార్య యెదుట వలవవలెనో?

నాకు నలుఁబదియేండ్లు లున్న నని నీదు
భావమో యేమొ కట్టుడుపండ్లు నాకి
వెల్ల తలకు రోజును రంగు వేయుచుంటిఁ
జంత చచ్చినఁ బులుసు చచ్చినదా! పడుచ!

ఇంతి! నీవు పుట్టినింటికిఁ బెండ్లి కి
నరుగ నీకు మేనయత్త కొడుకు
వచ్చు నీవు గాని పగలు రే మీ యమ్మ
నొక్క-యింత విడచి యుండఁబోకుఁ.

పడతి ! నీ గృహస్తకన్నుల కొడుకు మాదు:
నింటి కరుదెంచెఁ బుస్తక మ్మదో యడుగ
వెదకుచుండఁగ నే యట్లు బెదరిపోయి
పిలుచు చున్నంతలోఁ బర్వుపెట్టి వచ్చె!

నెల ప్రవాస ముండి తెలినుర్వులం గ్రక్కు
చింటి కరిగి సతి బహిష్ఠఁ గాంచి
పతియు నిలచి శాంతిప్రతిమకాఁ గామాగ్ని
బొగ్గు మిగులనట్టి బూది యయ్యె.

సంఘమందు నెట్లొ సారస్వతంబున
నట్లె యఃబ్బుఁ డొక్కఁ డధికుఁ గీర్తి
పాయఁ బలుకునేనిఁ బోయెడి మరియాద
గాని వాని కేమికలుఁగు జెపుమ.

వేయిహూకలు నష్టమ్ముపోయి పిచ్చి
యెత్తునందాక నగు వానిపొత్తు జేల
రేపు లాభమ్ము పదివేలు తోప నాఁడు
సాఁగు గర్వమ్ముముందు నీ నాఁగఁగలవె?

మునుపు వెలుతురులో నెంతయును భయంబు
పూని చూపులకును నాఁగఁజేసి చెలియ
యెదురుగా నిల్చె చీఁకటిముసుఁగునందు
నిపుడు చూపులవెనుక మ జాణి కలదొ!

ఔనె విరహిణి! యీ మలయానిలంబు
తా విమానంబుగా వచ్చి తగులఁబెట్టు
చల్లఁగా నుండు నిచట పంచాదియందు
“ఎయిరు రెయిడు షెల్టరు” సుమీ యిల్లు నాని.

ఇంత యిలు వీడనట్టి శుద్ధాంతకామి
నులకు మరియాద గల మనుష్యులును భద్ర
యొక్క మిత్రులు చాటున కొదుగవలసి
నట్టివారలు తక్కువా రాత్మజాతి.

ఔరా! పెండ్లము! ఊరున
నూరేగింపునకుఁ గ్రొత్తయుడుపులు వలయున్
కోరిక గల పతి నాకడఁ
జేరెడిచోఁ బసికిరాసి చీరలు చాలున్.

బందుగుల నా మహాకవి ప్రతిభపట్ట
రాని దైనది యింతమాత్రమ్ము వరుస
యైనఁ జాలును తాను బ్రహ్మయును వార
లో! సరస్వతులే! సత్యలోక కథలు.

మెల్ల నేహాది తిరుగని పిల్లవాఁడు
కాళ్ళపై వంగి సందుగాఁ గాంచుచుండఁ
దాను కొట్టిన, నవ్వేసు తండ్రిఁ గాంచి
యింతి వలపు చిప్పిలునట్టు లీసడించె.

ఆమె పదియేండ్ల కొడుకుపై కంగబుండె
కాని లోనూహా యెగ్రయేగాని లేదు
పందకొరుకులు కొరికితి నాఁడు తిరిగి
కొడుకవలె నన్ను యూహాయే యెఱుఁగఁబోఁడు.

ఊరిభార్య లెల్ల నూహించి యామె మం
సంబుతో నిడిరి శ్మశానమందు
నట పిశాచకాంత లాలోచనముచేసి
పడతి మఱల నూరినడుమ నిడిరి.

తనువున నత్తరు రాచుక
ధనికుఁ డొకఁడు వీధిఁబోవఁ దగఁ బురి దుర్వా
సనఁ బోఁగొట్టుట కని యా
తని యౌదార్యంబు మెచ్చెదరు భూమిజనుల్.

వార్ధకంబున యౌవనవతికి మగఁడు!
నీకు నీటును చదువును నీ ధనంబు
వలదు యువతికి జిహ్వకు నలుసు పరిచ
శంబు, సంగీతమును, శీతలానిలంబు.

వ్రేళ్ళు వ్రేళ్ళు తాఁకి పిక్కి పిక్కియు నాస
బుజము బుజము రాచి పొల్చుకొందు
రైలులోన జొమ్ము రాచినప్పటి కైన
నులికిపడియెఁ బల్లెటూరి పిల్ల.

స్కూలుపిల్లల మిస్సమ్మ చూడు మదిగొ
రాలిపడు కొంగ ఱెక్కయుఁబోలె నడచు
ఉన్న సుంతయుద్యోగము నూడినట్టి
నాయజన్మ పాళీలేని కలమువోలె.

చిన్నయుద్యోగ మిమ్మని చేరఁబోవ
బ్రాహ్మణుఁ డవని గుమ్మమ్ము పారఁదోలె
బ్రాహ్మణుండె కలెక్టరు వచ్చినంత
నడుగు నడుగున వలిపపు మడుగు లొత్తె.

అవునె మఱి కరివేపాక టంచు నీవు
వంటిచుట్టును తిరిగెద వెన్నిసార్లు
కుండి! నీకును పై మండ లందవాయె
సగము నంగుళ మైనను సాఁగవాయె.

రెండవు గోళమ్ములపై
రెండవుగోళములు తిరుగుటిని "సర్కస్"
పెండాలున నున్నట్లుగ
నండజగామినియు నడచు నందము కంటే.

వాఁడు పత్రిక పెట్టెను వ్రాస కేమి
చదువువచ్చున టంచుఁ బ్రశ్నయున? విన ది
నమ్ము వాఁడు విప్పెదు పురాణమ్ముముందు
మూఁడులోకంబులును డీలుపోవుచుండ.

ఊరిలో వాని కులకాంత యుండినపుడు
ప్రొద్దుటనె వంటయింటిలోఁ బాగలు త్రోఁచు
నతనిభార్య పుట్టింటికి నరిగనేని
పగలు పగలు చావడియెల్ల పొగలు పొగలె.

అగు నదృష్టమ్ము దురదృష్ట మద్ది యిదియు
యిద్దియని యొక్కొక్కప్పుడు నిట్లు చూడు
హశాసుకత్రియ రాణి తా నభిలషించె
నతని మఱునాఁటినుండి వాఁ డసలె లేఁడు.

రైళ్లు రేడియోల్ తంతివార్తలును గలుగు
కాలమునఁ జిత్ర మింత దగ్గరయు నైన
నచట మా యూరఁ గొంపల నార్పినట్టి
యతఁడు మీ యూర నింత వేదాంతి యెట్లు?

అధమకోకిల లెల్ల వాయసము లైన
మనము పెంచెడుచోఁ బెరిగినవి; వాని
కూఁత పంచమస్వర మఁట! కొసకు నేఁడు
స్వరములందున మనల ప్రసక్తి లేదు.

ఘనుఁడు క్రొత్తఁగ వచ్చె నింగ్లాండునుండి
రాతిరి భుజించుచుం డుమ్మె, మాత తలను
నీళ్ళలం జిల్కి "యెచట జన్మించితి" వన
డాబుఖై గ్రీనువిచ్చి లండనులు చెప్ప.

అడిగెఁ గొండవీఁట నప్పుడు శ్రీనాథు
డీవు కవివో యనుచు నెవరినోను
అడుగ నేమొ యిప్పు డతఁ డున్న మీ యూరు
వచ్చి పత్రికాధిపతివో యనుచు.

మఱియు పయి యధికారియు మంచివాఁడ!
యంచు నడిగెదవా! చాల మంచివాఁడు
పేర్మిఁ గొత్త గుమాస్తా విభీతదృశకుఁ
బంపినాడు బనారసు పట్టుచీర.

అల దుకాణముపై నమ్మనట్టి యతివ
ముఖముచూడంగ యువకులు మూఁగు చుండ్రి
ప్రియపడి యొకండు దమ్మిడీపెట్టి కొనఁడు
చేయి తగులునో యన్న భీచేత నుదరి.

వారి కులమున లేదన్న వాక్కు లేదు
తండ్రులతరంబు పుత్రులతరము వెంట
ఎల్ల తండ్రులకును చేతి కెమ్మ లేదు
కొమరులకుగాని రక్తమాంసములు లేవు.

కొందఱకు మైత్రి నెఱపెడి
కందనకాయయును నసలె కలుగదు వారున్
చందిరుని వెలుఁగునవ్వుల
నుందురు జాగ్రత్తపడవె యో మృదుప్రకృతీ!

మొదల, బిరుసైనకన్నుల యెదుటు చూపె
వనరుహాక్షి సంబాళించుకొనఁగలేదె
ఊహామెయి నీవు చీరకొం గొడిసిపట్టి
నింటి కరుదెంచి మఱి తమాయించు నిపుడు.

పూర్వ మిద్దఱు చెలికాండ్రు మొదటివాఁడు
పరులకొంప లారిచి తిరుసతికిఁ బోయె
వీడు దుష్కార్యములును దుర్విధులు చేసి
నాచమించు సహస్రగాయత్రితోడ.

పతి దైవ మ్మను నర్థము
సతియు క్షణము క్షణమునందు స్వార్థకపరచెఁ
వ్రతపుం బీటలపైనను
పతి నంటుక యొకటై గ గురుపాపై యున్కిఁ.

ఇచట దిబ్బవెట్టి యచట పాయను తీయు
ఏఱు చూచి యతఁడు నూఁయు సంబె
తన్ను నమ్మియుండి యున్నాళ్ళు నేఁటికి
పరుసియొద్ద నున్న తరుణిఁ దలఁచి.

అమృత మన నెట్టు లుండునం చడిగె దీవు
సకియ! యది నీకుఁ దెలియు టసంభవంబు
చంద్రునకు నెట్లు తెలియును చంద్రుఁ డింత
చల్లఁగా నుండు నని, యది జగ మెఱుంగు.

మగఁడు దాసిని రమ్మని మగువ దోసెను
దాసితల్లిని రమ్మని తమరియింటి
యందుఁ బనిచేయుటకుఁ దగవాఁడ నవ్వి
తనకు రావీలులే దనె దాసి తల్లి

ప్రాణనాథు ఱొమ్ముపైనె మేల్కొనియుండి
కన్నులారఁ గంటి వెన్నెలలను
మెలఁత! రాతి రెల్ల మేఘాలు క్రమ్మెను
ఉఱిమె, మెఱసె, యట్టె కురిసె ననెదు.

నమ్మ వాపిరిగొట్టుతనంబు గాని
చిన్నమెత్తైన మఱి సాహసింపలేడు
నదికి స్నానమ్మునకు వచ్చినాడు మొన్న
భయ మటంచును నీటిలోపలికి దిగఁడు.

బావ! "డార్విను" చనిపోవఁబట్టి నయము
వాఁడు చేసిన పరిణామవాదమందు
దొరకలే దఁట లంకె ఆ దురుసువాఁడి
అట్టె నినుఁ బట్టుకొని లంకె యనియ యుండు.

వనిత! నీ వల్ల చివురాకువంకఁ గనను
అది మదను నైంద్రజాలికు పదను బాకు
ఎన్ని రూపాలు దానికి నిపుడు కత్తి
అంత పులినాల్క యంతలో నగ్నిజిహ్వ.

'శాకిమా' మ్మని పడమటిశాస్త్రిఁ దూర్పు
శాస్త్రి నడిగితి నితఁడు భాష్యములు, నతఁడు
ఫ్రెంచి రష్యను గ్రంథముల్ విప్పినారు
పిసరుసారాంశమును తేల్చి పెట్టకుండ.

నీకు నుద్యోగ మింతయు లేక నాలు
గేండ్లుగా స్నేహితుల బిచ్చమెత్తు చుంటి
వీథివాకిఁట నిలచిన బిచ్చగానిఁ
గూలి సేయరాదా! యని కోపగింతు.

దాని కదే దీప్తి కిదే
దేని కదే వాసి పాండితీమహిమంబుఁ
వాని ప్రవర్తన, బోధ
స్థానంబులు రెండుగావె! తానును! ఇక్బాల్.

వీధి పంపుకాడ వేయిబిందెలు నొక్క
మొగిని నిండినట్లు పొంగిపోదొ
తాను మన్మథునకు మేనత్తకొడు కేమొ
అతఁడు వచ్చి కాళ్ళులందుఁ గడుగ.

ఓయి! మా తోటలో నున్న కోయిలమను
గొంతులోన సన్నసిజీలు కొఱఁతవోదొ
అద్ది విరహిణి కాఁబోలు నక్కటకట
మంట నిప్పాయెఁ దినుటకు మావిచివురు.

అల్ల యాంబోతుకడ నెదయైన యాత్రిఁగ:
గట్టివేసిరిఁ తొలఁగిపోఁగాక యుండ
తొలఁగిపోవదు సుమ్మాన సలచి ఘాటాను
చెయిదిఁ దిమిరంపుగుబ్బల వయసుకత్తె....

పొలతి! పతితోడఁ బోరాడి బుట్టిసింటి
కరుగుదెంచితి వేఁడాది యయ్యో నెవఁడు
గాని నీవంకఁ గన్నెత్తి కాంచరాదు
అట్టె నీ తలయంతయు నట్టకట్టె!

ప్రథమభార్యను రాచి అంపానఁబెట్టె
నతని కీయను నా కూఁతు ననుచు నీవు
నెఱుఁగక వచింతు, నీ కూఁతు నిచ్చి చూడు
అతని నెత్తిపై దేవత యగునుసుమ్ము,

మూర చాలియు చాలని చీరకట్టి
చిన్ని చెంబుతో నీళ్ళులు చేదుకొనఁగ
ఎన్నిసారులు వచ్చునో యింతసిగ్గు
పడుచుఁ బడుచు శృంగారపు బావికడను.

గొడ్డు వచ్చిన వేళయుఁ గొమ్మ వచ్చి
నట్టి వేళయు; రంభ యా నతనిభార్య
కాపురమునకు వచ్చెను ప్రాపకములు
ఎంతలో వాని కవి యెన్ని యెన్ని దొరకె!

అటు వరుస వెలవెలందులు
ఇటు వరుసను లేచివచ్చి వెలనాగలు తా
నటు గడప గడప ముసలిది
యిటు పెంపుడుకుక్కపిల్ల లింటింటఁ బడిశా.

వాని కులములోని వనితల యూరిలో
నడక నీకుఁ దెలియు నాకుఁ దెలియు
ఇతరకులము వారి యింతులగూఱిచి
వాఁడు చూడు మాట లాడుతీరు.

భూపతులు విష్ణునంశను బుట్టి రనఁగ
నవ్వోదు సమానములు లక్షణములు చూడు
తల్లక్రిందులుగా నీవు తపసుచేయు
దర్శనమె కాదు మఱి వరదానమున్నె.

జిలుగుపయ్యెద గంజికుచ్చెలలమోఁత
గందమును మల్లెపూవుల కమ్మతావి
కలసి నడచుచు నున్నట్లు కానిపించు
బండువెన్నెలలోపలఁ బయన మెటకో!

నీకుఁ జలివేయ దనుటయు నిక్కవంబె
ఒడలిసిండుగ నంత బొచ్చున్నయట్టి
జంతువునకును దేనికిఁ జలి ఘటిల్లు
వైష్ణవుఁడు గొఱ్ఱెయును గానివారలనను.

రయిలులోఁ గూరుచున్నట్టి రమణియొక్క
కోఁతివలె నున్న యేఁడాదికొడుకుమీఁద
దాను శిశువులపైని వాత్సల్య మెంత
నెఱపవచ్చునో యంతయు నెఱపె నతఁడు.

క్రొత్తపెండ్లము మగఁడైన కొడుకు తనదు
తల్లిఁ బొరుగమ్మఁ దోడిచ్చి తనకు జీత
మల్ప మైనను శ్రీశైలయాత్ర కనిపె
ముద్దుకోడ లందిచ్చిన మూటతోడ.

మేడమీఁద నాను మేడక్రింద నతండు
వేసినట్లు చేవ తీసినట్లు
దృష్టిగనుటె కాని ధృతి: నేటవాలైన
మేడమెట్లు నెక్కలే డతండు.

నాలుగుపుట్లుం బండఁగ
నాలుగుకుంచాలు వి త్తనము చల్లుదురో
శోభక! యీా చదు వేమిటి
కూలి మిగిలి నాము వేసికొనిపోవుఁజువీా!

రంభవలె నున్న దని సంబరమ్మునపడితె
దాను పెండ్లము గని, కాపురాని కాము
వచ్చుచును దోడఁ గొనివచ్చె బసివశోరుని
చీలిజగడాల చిల్లికజ్జాలవాని.

అందమైన భార్య యైనట్టి, పల్లియం
బెరిగి చదువుకోని పేదవాఁడ
నాగరులను చదివినా రస చుట్టాల
నిల్లుగాసి పట్టనీయఁ బోను.

ముక్కు లింతగాఁగఁ బొడుచుకవచ్చెడు
చనులు గలిగినట్టి సుకుమారాల!
పాలుతీయ నీవు పసుగత్తెకే గేజె
పడ్డ కల్ల నీసుఁ బడదు సుంత.

పొలియ్య సుండిఁమటసునయి సొలతి యంత
కష్టపడి యూఘద నేలనే కాఁ దత్తుంచుఁ
గెలనఁదిరిగి కూర్చుండు మాకేకరముల
కులికిపడి వహ్నిజ్వాలలై యురుక డేను.

తొడిమపట్టు మెల్లఁ దొలఁగి తప్పించుక
పండు నేల రాలిపడిన యంత
చూతశాఖ చివురుజొంపమ్ము మొగముతోఁ
పండువంక నల్లె వంగి చూచు.

ఇది యంత్రయుగ మటంచుం
బనింబడి వచింప నేల పండితుఁడా! నీ
పదనగు వాగ్ధోరణి యీ
కదలెడు గతి నాకు నమ్మకము పుట్టించుణా.

పండితులె యెల్లవారు 'కావంతి' యనుచు
నడుగ నొక్కఁడు చెప్పలేఁడనియొ నతఁడు
మఱియు సందర్భ మే మన, 'మనుచరిత్రొ
లోని దసరయొ 'మాయాంద్వార' పైని మాట.

అవు నవుఁ జిటారుకొమ్మ నున్నట్టి పూవు
లామె కందవు, పూజకై యందుకొనఁ
దమరు మఱి కోసిపెట్టినఁ దప్పు కాగు
కొంత సిగ్గునఁ గొను టంతకన్నఁ గాదు.

ఓయి కుంటిగోవ! యా యూరిస్త్రీ మమ్ము
నడిగె నీవు కుశల మన్నిమెడల
గుజ్జు మామివారి కోడలు కుశలమ్ము
వారి యింటిలోఁ దుపాకితోడ.

అసలు తోవ యిట్లుండఁగా నల్లనైన
గిరికిఁ బైనఁ జుట్టంతయుఁ దిరిగివచ్చెఁ
జివరి కొరిగిన దే మైనఁ జిన్నమెత్తు
కలదె! ఆ కొండ విదలించెఁ గాలురాళ్ళ.

తాటి మొవ్వుమీఁదఁ దా వచ్చి మఱి కొంత
సేపు నిలచె నిరుటి చిన్నమొయిలు
తోటఁ గ్రొత్తమొగ్గ తొడిగిన కడిమికా
కామునందు గగురు గఱుకు తోఁచె.

రబ్బరుబంతులె యైనను
నబ్బో ముట్టుకొన నీయఁ డా నటకుఁ డటుల్
డబ్బిచ్చి తాఁకు చుందురు
కొబ్బరి పాల్ద్రావినట్లు ఖొజ్జారసికుల్.

నీ యుక్కసు తీరినదా
నీ యారాటంబు తుదకు నిలచినదా! అ
బ్బో! యెంత తిరిగినావే
కాయజునకుఁ గంపబడ్డ కాకివిధానన్.

న న్నుంచుకొనిన వానికిఁ
గన్నుంగప్పాటయు నంతకష్టము కాదే
నిన్నువిడచి యెన రెవ్వరొ
న న్నడిగి రటంచుఁ జెప్పినం జాలు సఖా!

కదలక యట్లే చూచును
అదిరా! ప్రతిరోజు, నదియ యనుకొంటెని నే
నది యింత పలుకరింఁగితిఁ
దుది కీ గతిఁ బోయి యన్నతోడం జెప్పెఁ.

అతని పెండ్లమునగపోయె, అరుగుమీఁది
కుట్టుపసివాఁడు దొంగగాఁ బట్టువడియె
గుట్టుచప్పుడు కాకుండఁ గూరుచుండి
రెంత మర్యాదగలవారొ! యీవె చూడు.

ఊరక బిగించుకొని కూరుచున్న పతిని
తాఁకఁబోవఁగఁ దాఁకవద్దని యతండు
నోలి "ఘాబాడ్డు మాలు" జిల్లాలు పెట్టఁ
జెరవ బలవంతముగ విడఁదీసె వ్రేళ్ళు.

చెఱిగిన తిలకము దిద్దెను
శిరోజములు దువ్వుకొనియెఁ జీరను దాల్చెన్
సరిచేసి ముడతలను నె
వ్వరు గుర్తిడఁ గలరు దాని భావజకేళిన్.

నీవు వేసినకడవయు నేను వేసి
నట్టికడవయు బావిలో నడుగునీటి
మట్టమునఁ దాఁకి కిలకిలా మధురహాస
మాచరించుచు నున్న వే యంబుజాక్షి.

కొంటె పదిమందిలో భార్యకొంగులాగ
లీల, సిగ్గరి, సతి, విదలించి, 'బామ్మ!
చూడవే' యన నా వృద్ధ, సుద్దిలేని
దిప్పకాయ యటంచును దీర్పు చెప్పె.

రైలులోఁ గూరుచున్నట్టి యాలుమగల
యెంతో యన్యోన్య మైనట్టి హేలఁగాంచి
కూడిన జనంబు వాపిరిగొట్టుతనము
బెదరఁగొట్టెను చూపుల నదరుచేత.

ఓసి కీర్తి! నీకు నొక వేయిమొక్కులు
లజ్జవిడచినన్ గులంబుకొలఁది
వర్ణభేద నిందఁ బైపైని రచనల
వచ్చునీవు నాకు వలదు వలదు.

క్రొత్తపెండ్లము నొక్కతెను గూరుచుండఁ
బెట్టి కూర్చుండి పతి వెనుకట్టునందు
నేఁగుచుండఁగ బండికి నెదురువచ్చు
దొరను గని యామె సిగ్గులబరణి యయ్యె.

బండిపై గడ్డిబొద్దు నాపైసి భార్య
బండికాడిపై దాను కూర్చుండి కొరుకు
లూరఁ జనునట్టి చిన్నిపాలే రొకండు
అర్జునుండు సుభద్రాపహరణవేళ.

దానికిఁ జ్ఞాతిక మందియు
మానుగ నా కొకక వందమందియు బిడ్డల్
మేనత్తకూఁతు రైనను
దా నేటికొ యింక నాకుఁ దగసిగ్గుపడన్.

ఓసి వెలఁది! నీవు నుత్సవంబునకును
నేఁగ నాకు నిష్ట మింతలేదు
ఉత్సవంబుఁజూడ నొక్కఁడు రాఁ డందు
మిమ్ముఁ జూచుటకునె క్రమ్ము చంద్రు.

ముసలిభర్త తాను ప్రొద్దుటఁ బ్రొద్దుట
నిత్యమల్లియందు నీళ్ళుపోయఁ
బడుచుభార్య ప్రొద్దువాలు సంజలయందు
మల్లిమొక్క మొదట నీళ్ళు చల్లు.

మఱియుఁ గోటప్పకొండయు మంగళగిరి
మొదలు నిన్ని పుణ్యక్షేత్రములను నిన్ని
యిన్ని తిరునాళ్ళు జరుగ నీ వేమొ యతని
సుఖ మెఱుఁగ నంట నిజముగాఁ జోద్య మతివ.

అతఁడు మంచిమనిసి యౌనో కాదో చెప్ప
వాని నడుగలేను నేను బోయి
అతడు తానె చేసె నడుగక యుపకార
మచట నచటఁ జెప్ప నడిగితి నని.

ఎప్పుడు నెవ్వరో కొందఱు
గొప్పకవిని తెలిసి మెచ్చుకో రని దిగులా!
అప్పరమేశ్వరు లేడని
చెప్ప ప్రభువు లున్నయట్టి క్షితితలమందున్.

దేవుఁడు పుణ్యము పాపము
భావిత కర్మఫలమాది పాటింపని, నీ
తో వాదించుటకును మఱి
నీవలె నాస్తికుఁడ నగుట నేనును వలయున్.

జీవితములోన తా నొక్కచేడె మిగిలి
పారువోనట్టి యొక్కొక్క ప్రకృతి కేమొ
పరమదురదృష్ట మే మన వాఁడు మొదటఁ
గలసికొన్నట్టి సతి మూలకాకె యగుట.

విఱుచుకొనురొమ్ము పెండ్లము వెనుకఁ బోవ
డప్పు బుజమున నిడి గూనుగొప్పిగాడు
మదనుని గజోత్సవముముందుఁ గదలిపోవ
వెనుక నాబత్తుతో లొట్టిపిట్టవోలె.

బోగముది పెండ్లియాడిన పొరుగు మాది
యయ్యాయో యామె వచ్చిన దాదిగాఁగ
మఱి పతివ్రతా మహితధర్మముల పుణ్య
పాపముల యుపన్యాసముల్ పట్టరావు.

ఆమెతోఁ జెప్పినవి యామె యీమెతోడ
నీమెతోఁ జెప్పినవి యీమె యామెతోడ
సవతు లిద్దఱు మఱి పరస్పరము చెప్పి
కొని ఫలితా సాఁగఁదీసిరి కొసకు రేల.

తెలియఁ బైయధికారి తప్పులను లెక్క
లేదు వానికి నొకశిక్ష లేదు మఱల
చిన్న జీతమ్ము వాఁడు చేసినది దోష
మవునొ కాదొ యుద్యోగ రామార్పణంబు.

శతమఖుడు గౌతముని భార్యఁ గతుకుపొంది
పుట్టుమచ్చలను చిఱుతపులియ యయ్యో
పిన్నమామ మేదరవారిపిల్ల నతికి
నలుపుచారలతోఁ బెద్దపులియ యయ్యో.

పేదసంసార మిద్దఱు పెండ్లములును
కుమిలిచి కుదించి కూలిచి కుప్పవెట్టె
క్రమము విడి వెంట వెంటఁ జక్రమ్ము లెత్తు
పల్లముల లాగు రెండెడ్ల బండివోలె.

సన్న తెలిచీర తాలిచి స్నాన మాడు
పడఁతి! నీ యంద మంతయు బట్టబయలు
సిగ్గుపడి చెర్వులోఁ గంఠసీమదాఁక
మునుఁగు నీ కనుల్ కలువల మొట్టమొదలు.

సమరస మృదుకుల సతిసిత
కమలాపాంగములఁబోలు గద్యము పద్యం
బమృతరస వ్యంజక నా
ట్యమనోహార్యప్సరో దృగంతముబోలుఁ.

చిత్తమును నిల్పుకొనలేక చిలుముపట్టి
రైలుటిక్కట్టు లేని బైరాగి యయ్యో
మదికి నిర్దుష్టభాష నమర్పలేక
యభ్యుదయమార్గ మూని హాస్యకవి యయ్యో.

అతఁ డెదో హాస్యరసవేత్త యంచుఁ జెప్ప
నాయె టిక్కట్టుకొని చూడఁబోయినాను
పోయి వాని వికారపుమొగము వాఁడు
వానిఁజూచుటకే నవ్వవలసివచ్చె.

మగువ నల్లనికాంతి మైమఱువు తోఁప
వచ్చి శివరాత్రికిని బ్రాఁతపగనుతీర్ప
చెఱకుగడ కొని బుజమునఁ జేర్చికొంచు
తిరిగి మదనునివలెఁ బోరి కరుగుదెంచె.

ఓరి! మామ నీ కూఁతున కురక యేల
పరికిణీ, రైక కుట్టింపవచ్చు బదులు
ముందు పరికిణీ తన కరంబులకుఁ జుట్టి
కొంత కొంత ఱొమ్మనఁ గప్పుకొనెడుఁ జూడు.

నాన్న! రాజుగారికిని నెన్నండుగాని
కోప మింతైన రా దిది గొప్పగాదె
గొప్ప కా కేమి? రాజునుగూర్చిగాని
చిన్న మెత్తైనను విమర్శ చేయరాదు.

తొలినాళులఁ బద్యార్థము
తెలియనిచోఁ బాఠకునిది తెలియమి, యానా
ళుల వ్రాసినకవి దోషము
కలి ముదిరినకొలఁది చిత్రగతులను నడచున్.

తెగ బలిసి, బిర్ర బిగిసిన
దగు లాగూ తొడిగి నడుమునంతకుఁ గోటుం
దగఁ జను, దెలుఁగు దొరా? గుడి
పొగిలి విడిన కాలభైరవుండో కనుమా!

ముద్దుకొనఁగ నీదు ముట్టుకోనీయదు
తొలఁగి పండుకొనియె దూరముగను
పలుకఁ గసరికొట్టు, పయ్యెదకొంగుతో
బతికి విసరు నేలో పద్మగంధి.

తల్లిపాలు చాలనియట్టి పిల్లలకును
ఈ బజారెల్లఁ బోయి పాలిచ్చు నామె
ఆమె వక్షస్స్థలంబు సింహాద్రికొండ
సురనది స్రవించు శివజటాజూటి రయ్య.

వాఁడు నన్నుఁ జూచి కనుల జిల్లేడుపాలు
పొడుచుకొను నేలో?— కన్నులు నుడుసు చేసి
రెండుధారలు చనుబాలు పిండు మన్న
నసిగితివి గాని మఱి పిండినావె చెలియ!

క్రొత్తగా గ్రుడ్లుపెట్టిన గూటిమీఁద
కందిగింజలవలె నుబ్బు కనులతోడ
కదలిపోవదు తొండ డొక్కలును దించు
కొంచుఁ బోయిన నైన నాఁకొన్నకతన.

ఉవిద కొక్కపురుషుఁ డున్నతోద్యోగాన
కొక్కపురుషు డిద్ద ఱొక్కతీరు
చేడె పదవి రెండు చెడిపోవకుండంగ
పాడుకాపలాయుఁ బైసి పొగరు.

ప మేమో యిద్ది ప్రజా
స్వామిక మట ధనము పలుకుబడియుఁ రెండుఁ
సామర్థ్యంబును జంపెడు
నా మహనీయ మగు శక్తి కంతసి లేదే.

కడుపు లేదును మరి వల్లకాడు లేదు
అతివ తా నోకిలింతల నభినయించు
ఉంచు కున్నట్టివా డిచ్చె నొక్క యింత
డబ్బు, డబ్బుకు కొడుకు పుట్టడు గదయ్యా.

కావ్యములలోన వర్ణిత కచకుచములఁ
జూచి యా ప్రభు వేవగించుకొనెఁ బూర్వ
కవులపైఁ గోపమునఁ తల్లి యువిద కూఁతు
కోడలుల రూపమైన జేకోడు మదిని.

మాఘ ఫాల్గుణముల మాగానిపొలముల
గడ్డికడెము లోలిగాఁగ నెసఁగె
ముసలి సస్యలక్ష్మి ముంగురుల్ గిరికొను
పసిమియైన ఫాలభాగమట్లు.

ప్రేమ లేద యిద్దఱికి నగ్ని సాక్షిగా
నైన పెండ్లియందు నాదరమున
గంగ యమునవోలెఁ గలసియేపోదురు
గంగ యమునవోలెఁ గలసిపోరు.

వెస స్వరాజ్యము వచ్చినపిదపఁగూడ
సాఁగి యింగ్లీషుచదువునే చదువునట్లు
అంగనామణి పెండిలి యాడికూడ
ప్రాఁతచట్టరికమునె రాపాడుచుండె.

హైలులోన మొగము త్రావుచు నున్నారు
కొంతమంది యెదుటఁ గూరుచుండి
పిల్లవాఁడు నోరువెట్టుచు నున్నాడు
ఛోమ్ము త్రావనీదు శ్రోణిచక్ర.

ధాత్రి మతముపేర నెత్తుటేఱులు పారె
నంచుఁ గోప మూను నతఁడు తగవె!
ధాత్రియందు నెన్నొ తడిగుడ్డ లుండఁగా
గొంతు కత్తితోడఁ గోయు టేలొ?

అల్ల రాజుగారి యాస్థాన పండితుం
డనిన నెల్లకవులు నణఁగి యుండు
రొక్క విషయమందు నొకచర్చకును రాడు
నలుగు రున్నచోట నిలువ డసలు.

ఆశ్రయిం పన్న దేవత కతఁడు భక్తుఁ
డనయ మా దేవి పండినయదియ పంట
ముగురుతల్లులకును నామె మొదలివెలుఁగు
నలువరాణికి నాయమ వలస బీడు.

కాని విన్నావురా! మనవాని కార్య
మైనరాతిరి మన్మథుం డైనమాత్రి
మసలు రాలేద ఎప్పుడో యరుగుదెంచి
విడిచివచ్చిన ఎచ్చటో విల్లు నమ్ము.

ఎవరికో వార లుద్యోగ మీయ నెంచి
భాసురంబుగఁ బ్రకటనచేసినారు
“ఫీజు” పదునేను రూకలు, వీఁడుకూడఁ
దనకుఁ దినఁదిండి లేదు చందా నొసంగ.

అంత పెరిగియును సమర్థయాడ దంచు
భర్తయింటికిఁ బంపిరి పడుచుకత్తె
చోటు మార్చిన లేగున్న చూతమట్లు
లేమ రెండేండ్లలోన ఫలించెఁ జూడు.

ఎన్నొచిక్కులు పాసిపోయినవి తండ్రి
కతనిచదువును బెండ్లియు నన్ని కొడుకె
చూచుకొనె, వేనినో నీటిచుక్క తనకు
వదలఁగాఁ దండ్రి చూచుకోవలసెఁగాని.

తిండిలే కస్తిపైన తెలుఁగునాట
నంతలో నిరుద్యోగ సమస్య తీరె
దాడిలేని ఏ. ఆర్. పీ.యు తాళి లేసి
చలనచిత్ర సరస్వతీసతియు వచ్చె.

మొగనిచాటు అంకుమాఁదిరిగా నుండె
వాసిదైన వాదవైభవంబు
కా దనంగ రాజుగారికిఁ గోపంబు
అవు ననంగ దేశ మంటుకొనెడు.

ఆవి తేరెడుఁ బాశ్చాత్త్యభావములను
విలుచు చున్నారు మన తెల్గుపేరు పెట్టి
“ఒక్కటే ధర” అంటించి యుండెఁ జూడు
చిత్ర చిత్రవస్తువుల ఫ్యాన్సీబజారు.

యుద్ధములు కల్గుదేశాల నొక్కపురుషుఁ
డెందఱో భార్యలుగఁ జట్ట మెసక మెసఁగ
యుద్ధములు లేని దేశాల నొక్కపురుషుఁ
డొక్కభార్యయుగాఁ జట్ట మొప్పు లోలుకు.

జీవుఁడును సుఖదుఃఖముల్ చిత్తవృత్తు
లైహికాముష్మికమ్ము లివన్ని పోయి
యంధమనుజులు యుద్ధాగ్ని కింధనములు
గాఁగఁ బలుదేశముల సృష్టి సాఁగుచుండె.

భుక్తి లేక దారపుత్రుల వధియించి
యింకఁ దాను చావ నెంచుచుండ
రాజభటులు కరుణ రక్షించి చెరలోనఁ
బెట్టి యింత తిండి పెట్టినారు.

ఎప్పుడో రెండు మాసాల కేఁగుదేరు
నల వసంతుఁ డటంచుఁ దా నాఁగఁ గలదె
మాఘమాసాదిఁ బూచిన మావిగున్న
నాకుమఱుఁగున వెలితేంట్లు లనుభవించె.

మూఁడునాలుఁగేండ్లు పొలివోని శౌర్యానఁ
బోరులందుఁ దనదు పేరు నిలుప
మదిని మెచ్చినట్టి మదనమహీపతి
లేమ పిఱుఁదుఁ గుండలీకరించె.

ఎంత ప్రియ మయిపోయెనో యెఱుఁగరాద
యెప్పుడో యుద్ధ మనినంత నిప్పు డపుడె
అంగజాతుని యింజనీరింగు షాపు
ప్రసవవనిలోనఁ జివురాకురాయి మొదలు.

పొలతు లాధారపడియుంద్రు పురుషులపయి
నాస్తి కలిగిన కులములయందుఁ జూడఁ
బురుషు లాధారపడియుంద్రు పొలతులపయి
నాస్తి లేనట్టి కులములయందుఁ జూడ.

బావ యెంతయుఁ గాకర పాదువంటి
వాఁడు వేసంగిలోఁగూడ వేఁడినీళ్ళు
కావలయు మేనఁ దోఁచిన గగురు గగురు
బెత్తికలువోసి సిరి ఫలోత్పత్తి కనుము.

కాలేజిప్రక్క వారి
ల్లా లేమకు వేళ యెంతయైనం గడచుఁ
బాలు రుపాధ్యాయులు నే
వేళకు నెవ రెవరు వచ్చి వెళ్ళెదరొ కనఁ.

అతని యనుభవంబు నది యొక్కటే తీరు
కావ్యమందు సంటి కాంతయందు
పరులు చెప్పినట్టి భావమ్ములే కాని
అతని సొంతభావ మనుచు లేదు.

పెద్దరాణి కాసావారి ముద్దియలకు
నందఱికిఁ జెప్పి మఱి వివాహములుచేసె
మఱియు నందఱిపెండ్లిండ్లు మాపుచేసి
మున్నుగల వృత్తిలో దించెఁ జిన్నరాణి.

పూర్వమున సంఘసంస్కారమూర్తి వార
కాంతలకుఁగూడఁ బెండ్లిండ్లు కావలె ననె
నేఁటి సంఘ సంస్కారపండితుఁడు మఱియు
మఱి కులస్త్రీలకే పెండ్లి మానిపించు.

జాతి మత వర్ణములె కావు జంతుభేద
మైనఁ గల్పితమే యని నట్లు చెప్పి
గోటలోఁ బీటవెట్టిన కొండముచ్చు
స్త్రీజనంబు నా-ప్రాంతాలఁ జేరనీదు.

మంచి యుద్యోగి తన మేనమామ కొడుకు
తన నెలలపిల్లవానిఁ జూపను లతాంగి
మోదపయిన నుండిపో యందియిచ్చుచుండ
కంచుకము పాల తడిచేసెఁ గాయజుండు.

పైసా చేపడ టంచును
ఆస విడిచి కోపమంది యది గర్వముగా
భాసింపఁగ "సంత సునా
యాసముగా రా" మ టంచు ననె నొకతీరై.

వీధినాటకమున వెనుకఁ గూర్చుండిన
వారు గోల లేపి పా మటంచు
ముందు చేరినట్లు కొందఱు వర్ణభే
దమ్ము లాడి జీవితము గడింతురి.

మొదటిసారి పులుకు పులుకునఁ జూచెను
నెలలు కొన్నిగడువ నిలచి చూచె
మఱల నెపుడో నవ్వె, మఱి చూడనేలేద
లేమ నుంత చొరవ లేనివాని.

మలుగులందునఁ దొలఁగించుమాద్రిగాఁగ
కేవలమ్ము కుంటించి డేకించుచుండె
నా బజారునఁ జివరి గేహంబుకాడ
గోడిబిళ్ళాడు చున్నాడు కుసుమశరుఁడు.

ఎంత డబ్బైన నిచ్చిన యింటిలోని
చిన్నవస్తువు త్యాగము చేయలేడు
వాఁడు; వీనికి మదిలేదు వర్ణభేద
ముల్లమునను శాఖాభేద ముజ్జ్వలంబు.

కలసి భోజనంబు గావించునంతలో
వాఁడు వీఁడు వీఁడు వాఁడు నైరి
వచ్చి యింతలోన వ్యవహార మందుకో
వాఁడు వాఁడె వీఁడు వీఁడె యైరి.

వాని కేమి మహారాజు వాని భార్య
సకలవిధములఁ బోషణ సలుపుచుండె
అతఁడు రే లెల్ల నా వీధియరుగుమీఁద
నిజము సుఖముగా నారీతి నిదురపోవు.

తోటతుది నున్న కోకిల
పాటను విని యాంగ్ల భావ పండితసఖుఁ డ
ప్పాటన్ భారత దేశపు
నైటింగే లన్న బిరుదు నాటం బలికెన్.

కాంత, తనకును "కంపెనీ" కాదటంచు
కంపెనీకాంతఁ దెచ్చె నొక్కండు పోయి
సవతిని నెఱింగి తెల్లనిసతియు నల్ల
మొగము నల్లనిసతి తెల్లమొగము వేయ.

దున్నఁబోయిన నక్కటా దూడలందు
నేమయిన మేయబోయిన నెడ్లయందు
క్షత్రియులు వైశ్యు లగయ ద్విజాతివారు
బ్రాహ్మణేతరు లుద్యోగశక్తియందు.

పొలతి, పొరుగూరు చనినట్టి పురుషుఁ డల్ల
వీధివాకిలిలోనఁ గన్పించినంత
ఏదో పని యున్నయట్లుగా నేఁగి చిన్న
దొడ్డి నారింజమొక్కపైఁ దూలిపడియె.

వారి దొడ్డిలో సిలఁబడఁ బ్రక్కవారి
మేడపైకి నద్దములోని నీడయట్లు
బావికాడికి నా దొడ్డివారి బాల
యును మఱిందంబు చేసికొనుండఁబోదు.

వారియింటికి నల రెండుప్రక్కలందుఁ
గలవు బ్రాహ్మణసంసారములును రెండు
పెండ్లి కాని కూఁతుసమర్త వీరి కబ్రి
మబ్ర మచ్చోట వారి సంధ్యాదిజపము.

ప్రబలమేఘాలు పట్టెఁ దుపానుకొట్టె
నల విశాఖపురీ సముద్రాంతవీధి
నొడ్డు కెరటాలు తెలినెమళ్ళో యనంగ
నురికె మైసూరు తెలిగిత్తలో యనంగ.

ఒగిని రాచరికపుటుద్యోగ మున్నచో
కానరాదు తిండిలేని లోటు
ఱెక్క బలిసి యుండు "రేషనింగు" మహత్తు
బలకరమ్ము తిండి కొలిచి తినుట.

రంగు బొమ్మలఁ జూఁచుట ఫొటొబొమ్మ
లను స్పృశించుటకంటెను లక్ష నయము
"క్లోరొఫారము" నందున్న కోమలాంగిఁ
దాఁకె డాక్టరు నిట్టమధ్యాహ్న బుద్ధి.

చేతఁ జిటుకలు వ్రాసి వ్రాచెండ్లు తలకుఁ
జుట్టి కాళ్ళకు గజ్జెలు కట్టి కావి
చీర రైకయుఁ దాల్చి క్రొంజివురు సురెవ
జీరు, వా రింట హారికథల్ జెప్పఁదొడఁగె.

ఒకని కిద్దఱు పుత్త్రు లుండి రేని
వేని భాగ్యమ్ము నిజముగా వానిదేను
విష్ణుసుతులలో గుడిలేదు పెద్దవాని
కంగజుఁడు కొనె నెన్ని పాడైన గుళ్ళు.

ఎండ కైన దంతు రెంతో యెంతో యూఁక
మనిసి కైన రాదు మానె డైన
ఈవు దంచు చుండ నెన్ని సంసారాలు
పుట్టి పుట్టిమునిగి పోవు చుండె.

ఇతనిచే నెల్లపనులు చేయించు నామె
యేల చేయించ దామె వీఁ డేల చేయఁ
డితనికిం గోర్కి కల దంచు నింతి యెఱుఁగు
నితఁడు వయసు మళ్ళినవాఁడు నింతిపడుచు.

మొదటిభార్య చచ్చిపోయిన దని వాఁడు
పొగులఁ బొగులఁ జచ్చిపోవు నంచు
భయము తోఁచె నాఁడు, పడతి రెండవయామె
వచ్చె నీమె యనినఁ జచ్చిపోవు.

బిగిసినట్టి గౌను దిగవేసికొని యేఁగు
బదియు నాలుఁగేండ్ల బాల బడికి
కుమిలి గాలి లేక గుప్పిళ్ళుపట్టుక
బ్రదుకు నేమొ యచట భావజుండు.

చెలువ మెల్ల సన్నచీరెలో నొడబోసి
యెదురుగాలి త్రోవఁ గదలెఁ బడుచు
కోమలాంగి గాలి గుంజీలు తీయించు
కుచ్చెలలును బైటఁ గ్రుమ్ముకొనఁగ.

ఒకరిమీఁద ద్వేషమ్ము లే దొకరిమీఁద
ప్రేమయునుగల్గదు చమత్కరించును కవి
తనకు దెబ్బయుఁ దగుల నందఱను గూడి
తానుకూడ నవ్వుట సముద్రాలలోఁతు.

పెండ్లిపీటలపయిననే పెద్దపదవి
నున్న నవభర్తతోఁ గూరుచుండి పడఁతి
జిలుగుకంఠంబుతోడ నాశీర్వదించు
కవికుమారుతోఁ జూపులు కలిపె నింత.

కూఁతురు సంపాదించిన
దా తీరునఁ దినక కొంతయైనను దాచం
గూఁతునకు మగఁడు దొరకును
నీతికిఁ జెడి డబ్బులేక నెగడునె మగఁడున్.

దొరపోగాను పెద్దతోట వేసెను వాఁడు
తిండి లేక గడ్డి తినఁగవలసె
వాఁడు తినకముందుఁ బైవాండ్రు తిన్నారు
పైఁడినగలభార్య వస్తు లుండ.

మొన్నటిదాఁకను భార్య య
టన్నను కఱినలుపు నాకు నక్కఱలే దం
చన్నతఁడు లంకెవిడిపో
డెన్నఁడు మదనుసిరహాస్య మెయ్యది కలదో.

చెప్పులోఁ గాలుపెట్టి సిద్ధపడవు స్వామి!
కదలిపో మ్మెట్లు నమ్మించగలను నిన్ను
వేగఁ జెప్పుడుమాటలు వినడ యేని
జగతిలో గొప్పవాఁ డెట్టు లగును చెపుమ!

అంత చిల్లని సమపాళమైన కాపు
సదరుగల పూజ వెలయుఁ గుండలును మూఁపు
రంయి మని చుట్లుతిరుగు చక్రంబుసాగను
పడుచు దెలియదె కుమ్మరివారిపిల్ల.

ఈ తెనుఁగుసినీమాలకు
బ్రాఁతిగఁ గొనిపోకు పిల్లవానిని వీఁడుగా
బూతులను నేర్చుకొనియెను
చేతోమర్యాదలేని చీదరమాటల్.

మఱి సతీతిలక మ్మాదిమాట లెల్ల
గ్రంథములయందు నీ వింతఁ గట్టిపెట్టు
అయ్యో! మంత్రులు కాఁబోవునట్టివారు
స్కూళ్ళలో బొ ట్లహాలో పెట్టుకొనుటలేదు.

తిండి లేనట్టి పేదకుఁ దిండి కలుగు
రాజ్యపతులకు టీ. బీ. శరణ్య మయ్యె
మందులేనిది యీ వ్యాధి మందు లకట
కొనుటకే కొంపయంతయు గుల్ల యయ్యె.

వలపు గుప్పు మన్న తొలిదినంబులయందు
పశువు కొంత నయము వాఁడు వలసె
వాడి వత్త లయిన మోడురోజులయందు
వేల్పువంటివాఁడు వీఁడు వలసె.

పరికింప దూరమునకును
సురియవలెఁ జేన వెదురుచువ్వవలెఁ సుం
దరముగఁ గన్పడి మఱి ముం
దరికింజని చూడఁ గోఁతి నయ మనిపించెఁ.

పేడ చేయుచున్న వెలఁది! విశ్వామిత్ర
మునికి నీదు భర్త ఋణపడియెనో
నీదు భర్తలైన జూదమం దోడిరో
అతఁడుగాని కలిసమాశ్రితుండో!

వినుము మనోవాక్కాయము
లని మూఁడు తెరంగు లంచు నది తెలియక యూ
డెను సావిత్రి యసలు దుం
డెను "దస్కతు" దానిపేరు నెటి నాల్గవదై.

కొడుకు చనిపోయి పాపము కుమిలి కుమిలి
కర్మచేసెడుఁ దండ్రి దుఃఖమున మునుఁగ
మసన మందె మనోవర్తిమాట నెత్తె
మంకుపట్టు వియ్యంకుఁడు మంటిపురువు.

అన్ని జిల్లాలలోపల నున్న సరకు
విలిచి కంట్రోలు పుట్టించు వీరశెట్టి
బాగుగనె యుండె నొక పది బారువుల కే
డంక వీసెకిఁ బుట్టెఁ జక్రాంకితంబు.

ఉరుకు లాడుచు వ్రేపల్లెనుండి వచ్చి
వడ్లు దంపుచు నుండె నీ పద్మనేత్ర
మున్ను రైక నెత్తుక చన్న చిన్నికృష్ణుఁ
డామెబొమ్మన నిపుడు ముత్యాలు పోసె.

తా నెంత ప్రియము పడదేఁ
చాన మొగము త్రిప్పుకొన్నఁ జాలు గొణుగు సే
దో సెంద ముడిచి కన్బొమ
సూనరి రౌడీల వెలిరుచుల్ మరగినదో.

ప్రాతవడ్డ సరంజాము బాకు విల్లు
సగుఁ డార్జించెఁ జంటఫిరంగు లాది
చట్టుబండలై లక్షణశాస్త్ర మార్గ
మూర్చి మిలిటరీ డిక్టేట రయ్యె మరుడు.

పరిశోధన కాలములో
సరయంగాఁ గవితయంద మది మెఱుఁగుదు రే
తరుణి నవహేల తెలియదు
శరీరమునను త్వగసృగ్వసా జ్ఞానముచే.

భార్యయందున శాంతితోఁ బడయుసుఖము
కామదహనాగ్నిఁ గను జారకాంతయందు
పరమశాంతి స్వదేశ భావములయందు
నల విజాతీయములతోడఁ గలక బ్రదుకు.

ఫలభరిత మంచు మాకందపాదపంబు
నాశ్రయించిన మల్లీలతాంగి చూడు
చివురు గన్నులతోఁ గటాక్షించె మావి
నంగనాజన ప్రకృతిరహస్య మిద్ది.

అవునె యోసి పొలమ! అయ్యయ్యొ అంతంత
నెఱ్ఱె లేల పడితి నీవుగాని
ప్రాణమిత్రుఁ డట్టు లరుదెంచి తడియార్చి
కృత్రిమముం గొనఁడు పగిల్చె నిన్ను.

మొదటిసారి ప్రియుడు ముద్దిడుకొన్నంతె
కన్నె బెదరి క్రొత్త కాల్వక్రింద
సాఁగుపొలము దంపనాగలి లాఁగిన
పెళ్ళ తిరిగినట్లు తెల్లవోయె.

చిన్నిపూవు కన్నఁ జివురాకు మెత్తన
దాని కన్న పిల్లదాని తలఁపు
తలపుకంటెకూడఁ దొలియీఁత మావెన్నఁ
పెట్టినట్టి దివ్వె పిల్లవలపు.

సారిది భారతమును వ్రాయ సోమయాజి
యగ్నిహోత్రాలు చేసినాఁ డనుట నిజమె
అగ్నిహోత్రాలు లేకుండ నక్షరంబు
సాఁగదేకద నేఁటి మా సత్కవులకు.

కాలకేయులు తెరలపైఁ గానిపింప
లచ్చికొడుకుల యాజ్ఞాబలంబువలనఁ
జతురుఁడై సినిమా కుంభసంభవుండు
తాపిగాఁ దీర్చికొని సముద్రాలు త్రావు.

తా నుషఃకాంతి, తెలవారుతరుణమందు
పొన్నతామరపూవులోఁ బుప్పొడివలె
విరిసినది యంచరెక్కల విప్పుతుదల
పైడికాంతులు తుదలందుఁ బ్రబ్బినటులు.

అమెరికా దేశమందున నంగజుండు
లావుపెదిమలు బొగ్గు నల్లనగు మేను
అచ్చరలు వానియందాని కభిసరింతు
రతసి కళివదృగ్వహ్ని దాహములు వేలు.

పరమ సుకుమార! మా యూరి చెఱువునీళ్ళ
మురికి యంచను బెదరంగఁబోకు పోకు
చివురు సంజలయందు దక్షిణపు గాలి
అచ్చరల యుత్తరుల కొంగు లంటివచ్చు.

అప్పును తన దేమిపోయిన దంత రెడ్డి
బిడ్డ చనుదెంచి మార్కులు వేయు మనిన
వేయ రా దేమి? వాఁ డేమి విజయి తనకుఁ
గడనుఁ జెడియెఁ బరీక్షాధికారిపదవి.

నిజమును బరాచికములోన నిహ్నవింపు
సరసహృదయుండు కోపము చాయఁబోఁడు
నవ్వు లేదు కోపము లేదు నగ్నమతికి
నూలుకొన నద్దిరొ, తొలి మనుష్యజన్మ.

రమణి! నే నంత సామంతురాల కాను
ఇల్లువదలి రా నాస్కార మింత లేదు
దాసదుంప తెగిరిలే జగాన నెల్ల
వనితలును నందగాండ్రకే భార్య లైరె.

దున్న బోయితి వేసియు దూడలందు
మేయఁ బోయిన నెడ్లలో మెలఁత మగఁడు
సుంత యెప్పుడైన "జాలెండు షోసు"కొఱకు
చిన్ని పెండ్లముకడఁ దహాసీలుదారు.

మైనలుపు కాదః పచ్చనిమనిసి యాయె
లచ్చికలిగినఁ గాడాయె లచ్చికొడుకు
చిత్రములు ముళ్ళుపెట్టుట చేతఁగాదు
మగుప యెఱుఁగదా! భర్త మన్మథుఁడుకామి.

ఏనుఁగును జూడలేదని సూనుఁ డనియె
ననియె జనకుండు చీట్లపేకాడుచుండి
వాసిబడులుగ మోటార్లువచ్చె నందు)
శతవిధంబుల నల్లనిజంతు వంచు.

నీకుఁ దెలియ దుద్యోగము నిల్పుకొమ్ము
కదలి పొమ్మనినను సాహుకారు రైతు
గిడస యుద్యోగి "హోల్డింగు" కేసుపెట్టె
సత్యవా క్కంతపనిచేసె సాహుకారు.

కొబ్బరాకు "బూరా" యూదుకొంచు వచ్చి
యమ్మ! మోటారు వెళ్ళెడు నంచుఁ జెప్ప
సరగ నాగేంద్రకొడుకును జనని "యిదిగొ
అన్నముం దిను పోద" మం చదను తెలిసె.

గోడ కట్టుటకై యందుఁ గొండరాళ్ళు
గుట్టగాఁ బోసి రటకుఁ బోఁగూడ దమ్మ
చిఱుత! అటఁ ద్రాఁచుపా మొండు తిరుగు చుండె
మఱియు నది మానిసింబోలె మాటలాడు.

ఎంత వెగటైతి నోయి నీ కింతలోన
దానిపతి పోయినంతన దాని వదలి
నాపు పతి నఖక్షతములు నా యురానఁ
గాంచి యిప్పుడు ననుగూడఁ గసరింతు,

ప్రియుడ! యెఱుఁగను మునుపటి వెలఁదుకల స
తివ్రతాత్వ మెట్టిదో! వారు తిట్టినంతఁ
జచ్చును కిరాతుఁ డగ్నియుఁ జల్లఁ బడును
నన్ను నీ వొకరుఁడే చావు మన్నఁ జత్తు.

అతనిచదువుకు సంవత్సరాంతఫలము
స్కూలులో వానిపేరును కొట్టివేఁత
స్కూలు కెదురుగఁ జిక్కనికూఁతు రున్న
కాఫిహోటలువాని తగ్గనిబుఱ్ఱం బు.

అల నిడదవోలులోన నాహారమంత్రి
తాను బెదరించెఁ బెద్దవర్తకుల "నిట్టు
లైనను గవర్నమెంటె ధాన్యంబుకొను" న
టంచు, 'వారును మనుజులే' యనియె శెట్టి.

ఆలోచన చేయఁగవలె
నాలోచన లేక తెలియ దర్థము, మఱి యా
యాలోచన విషయజ్ఞత
కాలోచితమైన స్ఫురణకలిమి సాగ సగుణ.

ఓసి! చంద్రుఁడు చల్లఁగా నుండు నంచు
నన్నమాటలు నిజమైనయట్లు లేదు
పది నిజమైనదిగనుక యిద్ది నిజము
అఱిఁటియాకులో! గంధమో! అలరో! చివురో!

మొన్న నే నుంటివే నీవు చిన్నెలాడి
లేమ యాసాసకురుపులు లేచు నీకు
తాళుకొనలేక పిఱుఁదును స్తనయుగంబు
నిదివఱకె బాధపడుచుంటి వేమి యనుడు.

"వాయిలు" చీరయు రవికయు
కోయిలకంఠమును కండ్లకుం గాళ్ళకు జో
ళ్ళా యలరుఁ బ్రక్క-పాపట
యీ యంగన యంగజునకు నే దుముదారా?!

తనగది నిద్దఱఁ జేరల్లో
నునిచెన రొయొక ప్రిన్సిపాలు యువతియు, యుసగుం
డును కాలేజీచదువరు
లనీతివర్తనము తెలిసి యది శిక్షింపన్.

ఏ మహారాణి లేచిపోయినను మఱల
దా మహారాణియే యగు దాని కేమి
మోసి వెర్రిబాగులదాన యుండి నీవు
లేచిపోయినను 'బజారు లేమ' వగుదు.

చెలువ యొకతె చింతచెట్టు పై గుల్లలు
కోసి తినఁగ నడిగెఁ గుఱ్ఱవాఁడు
తనను నోకఁడు విసరు మనుచు నా సింగారి
పులుపురొడ్డు నీను వలవ దనియె.

అతని కేమొ 'కాపింగు' లే దంచు వంక
వీఁడు 'బియ్యో' పరీక్ష తప్పె నని సబురు
పాయఁ బలికెడు నెన్నొ సంబంధములను
అంగజున కామె యేను మే కయ్యెఁ దుదకు.

వెల్లుగ వర్షర్తువు మరు
నల్లసి భూచక్రిగోడుగునాఁ జనుదెంచెన్
చెల్లీ! బావకు సెలవులు
మల్లడి వేసంగి మూఁడుమాసము లేలో!

అరకోడి యన్న నెంతా
దుమో మఱి యంతపెద్దతల్లికిఁ దోలిచూ
ల్బరువున బొంగరము నభం
గురగతిఁ దిరుగాడుఁ జిన్నకోడలిఁ గన్నన్.

ఒగి విశాఖపట్టణమున నొక్కప్లీడ
రొకకవి యుపన్యసింపఁగా నూది వినుచు
తెలుఁగులో భావ మెంత వ్యక్తీకరణము
సులభ మంచు నెఱుంగ నంచు వచియించె.

ఎంత యల్ప మహా ప్రాణియో యీ జగత్తు
తాను పనిచేయుచోట నుత్సవము జరిగె
శివుఁడు తొలినాఁడు తలపైన శీతకిరణుఁ
దాల్చికొన్నట్టు లయ్యె నీతని యెడంద.

వచ్చె "మోటిరి క్వెరీకుసు'' బ్రబల కుండ
లాలతోడ "ఘనాపాఠి'' బాలమూర్తి
చచ్చి సాధింతు నన్నట్టి సామ్య మయ్యె
బ్రిటిషురాజ్యంపుఁ గైతవ విద్య నీతి.

మొదట నన్నట్టి మాటనుఁ దుదిని నేఁటి
మాట కావంతయైన సంబంధ మున్నె
దానిపాడయే యెఱుంగనిదాసకిని, ల
తాంగి సుతుమీఁది ప్రేమకు నతికిపోయె.

చివుర! నీ తలలోని జేజెమ్మవంటి
వారుకూడ గడ్డి కఱచినారుసుమ్మ
ఋతు వొక వసంతమే కాదు ఋతువు లాఱు
కలవు చివరకు శిశిరసంఘమ్ము కలదు.

దాని నెఱుఁగుదు మఱియును దీని నెఱుఁగు
దు నని యూరక యెతుబారుతనము పోదు
పాటితోఁటలోనను జొన్నగూటికాడ
చెందనైన మర్యాదలు చెప్ప వేమి?

అప్పటికి వెన్నెలయుఁ బోవునప్పటికిని
జలియు వేయును బయట మంచమును వేతు
నంతదాఁకను బసిమీఁద నడుగవలయు
నప్పటికిఁగాని తాను రా నసియె ఛర్ర.

కొడుకునకు నీవునైతము వడుగుచేయ
నేల యా నాను బ్రాహ్మణ్య మింతరొంపిఁ
గూరుకొనిపోయినప్పుడు కూర్చి లాగఁ
గాను వలయును జందెపుకాళ్ళు వేసి.

వరుని కూటమిలోన జాగరమువలనఁ
గను తెలుపు తోఁచెఁ దొలుసంజకామినికిని
ముదుసలితనంబుచేతను నిదురరాక
కను తెలుపు తోఁచె మలుసంజ కామినికిని.

నలుగురును బందుగులు కూడినారు మీరు
కడఁగి తీర్పుచెప్పవలె నిష్కర్ష గాఁగ
నతివ పుట్టింటి కేఁగితి నంచుఁ జెప్పె
నటకుఁ బోలేద దీనికి నర్థ మేమి?

ఇంతి! నీవుగాని యెగఁజేపె నని గేవేఁ
బట్టి కోల్పుచువ్వ బాదినావు
తెల్ల వారికూడ ధృతిలేదు విన్ను నే
నువ్వుగింజయంత నోవ్వఁబలుక.

తా దులుపఁబోవఁగా బ్రిహ్మాదండిగింజ
గ్రుచ్చుకొనె ముల్లు మాలెతగోటిలోన
దాని ప్రియుఁ డెంత యిబ్బంది పైన పడెను
దాసితను వెంత సిమిరిన రాసె లేదు.

తెలితోవ పూరేకున లో
పల వ్రాలిన తేఁటి సరసిపడఁతుక నును చె
క్కిలిఁ బుట్టు మచ్చపోలిక
విలోకనకృతార్థతా నవీనతఁ దెచ్చెఁ.

రాజకీయజ్ఞు లెల్ల సారస్వతమ్ము
కూడఁ దమరె యేలెంగిన గొప్ప వోవ
నంద తెలెఁగిన రాజకీయమ్ము లకట
యొక్కశవులే యెఱుంగరా! యుర్వియందు.

సూర్యుచుట్టు తిరుగు చున్నది భూమి నీ
వెఱుఁగుదే యనంగ నెఱుఁగవలెనొ
భూమి స్త్రీయు సినుఁడు పురుషుఁడు నెవ్వరి
చుట్టు నెవరొ నీవ చూడు మనియె.

గుడికిముందు కట్టిన క్రొత్తగోపురంబు
టెక్కెమునఁ బావురాయి కట్టినది గాదు
ఒంటరిది యొక్క యందాల పెంటికొఱకుఁ
గువకువలు లేక కనుల దిక్కులను జూచు.

వదల స్త్రీకళాశాలను పడుచు తెల్ల
జనుచు నుండి రలంకారశాస్త్రసరణి
భావజుని మౌగ్ధ్యమాదిగా ప్రౌఢివఱకు
భావములు వేసి కవి యెఱుపరచినట్లు.

అక్కగారిని గొనిపోవ నరుగుదెంచి
తేను దానిఁ బంపించ నన్నాను మఱది
నాకు వేసిన శిక్షయే నీకుఁగూడ
న న్నిటను వేసెఁ గార "మర్ధర్ధ మణుగు".

ఉదధి నీ ర్పుక్కిలించి పె ల్లుమిసి తిట్టి
చెరువు నీటిప్రాశస్త్యంబె చెప్పఁజొచ్చె
కడలిపై నుండివచ్చిన గాలి ప్రాణ
శక్తి యందు నారోగ్యరసంబు కూర్చు.

విపులతరమైన భాషా
నిపుణత లేకయు విమర్శ నెగడించు నహో
కపురంబు పునుగు నత్తరు
నపుంసకుఁడు వాడినట్లు నల్దిక్కులకున్.

కొండ లెపుడు రసాబ్ధి మేఘుని విదల్చి
నేలకును లాగుటకుఁ బ్రయత్నించుచుండు
నతఁడు తగినంత వర్షించి యరిగిపోవు
కొండసెలయేళ్ళతోఁ దన గొప్ప చెప్ప.

ప్రక్క నద్దె కున్న వారి భాగంబున
సుతకు నిన్న రాత్రి శోభనంబు
నిదుర లేదునువ్వొ గది గది యంటుక
యున్న దయ్యె నడుమ సన్నతడక.

నీదు చలువవలన నే నీనీమాతార
నైతిఁ బెండ్లికూడ నందుకొంటి
కన్నెతికముమాట కాదట్టు లుంచుము
మదిని నిన్ను నేను మఱువఁగలనె.

అబ్బురముగఁ దండ్రి డబ్బియ డనిగదా
చేడె వదలి నన్నుఁ జేసికొంటి
రామె యిపుడె పెండ్లి యాడకపోతిరా
తండ్రి కిపుడు మీరు తగ్గి లేరు?

అర్థముం జేసికొనువార లనుచులేక
వ్యర్థమైన మహాకవి వాణివోలె
నకట! "ప్రాజెక్టు" కట్టు దిక్కనుచులేక
జాజువారెడు గోదావరీ జలంబు.

మఱియు పెళ్ళి మునుపె మాగాని యయ్యెను
కాల్వగట్టు పాటఁ గట్టువడియె
నూరిపశువు లెల్లఁ "గారుల" కడ్డుగా
గడ్డికరచు చుండె రోడ్డులందు.

శారద శారద యందురు
శారద న న్నెఱిఁగినంత జన మెఱుఁగుదురా!
శారదకుఁ గీర్తి కలదా
మూరా! యిందఱు నిరక్షరాస్యులలోనఁ.

కలవా! లేవా! అసలు ఖాళీలు మఱి తీరి
కయును లేద యిపుడు కాగితములు
పూత్రు రాతిరికిని సుందరి! రమ్ము రా
తిరికి గంట పెన్నిదింటి కైన.

భర్త పోయినవేళకుఁ బడతి విషము
పుచ్చికొని చచ్చిపోయెను బాలఁతిఁ గూర్చి
వేయి యనుకొన్న యూరెల్ల విస్తుపోయె
యువకుఁ డొకఁడు పెండ్లినాఁ డుస్సు రనఁగ.

తనభార్య ప్రక్క నుండఁగఁ
బనలుగఁ గ్రమ్ముకొను మొగులువంకం గాంచెన్
మును పితఁడు యక్షకాంతా
జనమునకుఁ బ్రవృత్తికొంచుఁ జనె నని పతియున్.

అమ్మ! రాముఁడు చంద్రు ని మ్మనుచు నడిగె
నంట భూగోళశాస్త్రమ్ము నపుడు చెప్ప
లేదు కాఁబోలు నన బిడ్డ; లేమ, కొడుకు
సాఁగి యింగ్లండు చన్నట్లె సంతసించె.

మన మేము వెలవెలందుఃఁ
మును మనతోఁగూడి వేసమును వేయదొ! ఆ
తన బ్రతుకు పెట్టుకొని తా
ననవలసిన మాట కాదో యానో యెఱుఁగదే.

ఎవడో! యొక్కవిప్రుఁ డితనికి నపకృతి
చేయఁ గులము నెల్లఁ జెట్టతలఁచు
నిట్టివారు పూర్వ మెందును లేరు, రు
రుండును జనమేజయుండు నిదియె.

కలువ, తమ్మిపూవు చెలియలు నక్కయు
పోకలందు మంచిపోల్కి కలదు
ఈమె పవలె దాచు నామె రాతిరిదాయ
సిందులందుఁ దేటిమిండగాండ్ర.

తినుటకుం దిండి లేదు వ్యాధి ప్రబలి పడి
పోయి "డాక్టరుc" జూడcగాc బోయినంత
తగినసలహాకుc బది యౌషధమ్మునకుc బ
దియును బండ్ల కయ్యెడునది దేవుc డెఱుcగు.

కొన్ని నాజూకుమాటలు కొన్ని గాలి
మాటలును చిల్కపల్కులు మూటకట్టి
యైన శారద చవుక నృత్యంబు నెఱపc
గేవల మ్మామె కిచట "మార్కెట్టు" బలిసె.

కవులు నేcడు రెండు రకాలు: కాళిదాసు
మొదటc బిమ్మటc దా నది మొదటిరకము
మొదలు తుదయును దానె యీ పూర్వకవులు
కవురు "బూర్జువా" లిద్ది రెండవరకంబు.

అవునుగాఁ గైతలో విషమాక్షరములు
పడిన తప్పకయ తగిలివచ్చు ననుట
వాని కథలకు మఱి వానిభార్య యిట్టు
లాయె ననుటకు నది సరిపోయెఁగాదె.

ఆ సంపన్న కళానిధి
భాసుర మగు యౌవనమునఁ బ్రాణము వీడెన్
వాసిగల పండితులు దీ
ప్రాసమబాణుండు నాశ్రయములకుఁ జెడఁగా.

ఓసీ యచ్చర! యే మా
యాసంపడినావె స్వర్గమందున నీవున్
మా సీమ కిపుడు వచ్చితి
మాసర శిశిరార్ద్రిఁ డైన మలయానిలుతో.

చైత్ర మాసంబువందున సంజవేళ
నేటియొడ్డున నూహాచే నెడఁద కరఁగ
దూఁకు కళ్యాణరాగమ్ముతోడఁ గలసి
వచ్చు పద్యమువలె వచ్చె భాసురాంగి.

అకట! నూతనదేవాలయం బొకండు
కట్టు టన్నను బుట్టెడు కంటగింపు
నందె హరిజనదేవాలయ ప్రవేశ
చటులయాత్రలఁ దట్టెడు సంతసంబు.

వారి దొడ్డినుండి వీరింటి గడికిని
జెంత ప్రాలె సీమచింతకొమ్మ
గోడ కొంత రాచుకొన క్రిందిముం డ్లూడ
వచ్చు నెట్లు పోయెఁ బైని ముండ్లు.

కోపపడకు మయ్యా! కుహనామనోజాత
వయసు దాఁటినట్టి వారితోడఁ
బడుచులకును బెండ్లివల దన్నమాటలు
పేరు తెచ్చుకొనఁ బ్రచార మింతె?

పగలు తప్పకపోయెడి పడతులందు
నిశలఁ దొలఁగిపోవరు సగానికి సగంబు
ఆ సగంబున సగము నీదైన యురము
చూచుకొనవలె బెజ్జాలు చొరకయుండ.

నలమహారాజుబోలు సుజ్జ్వలులు మఱలఁ
బుట్టరంచుఁ బౌరాణికుఁ డట్టె చెప్పె
నరయ నాకాశరామన్న యట్టివాఁడె
వాఁడు వాఁ డని తెలియని వాఁడుగాదె.

మతము లే దందు రేకాని మహితమతులు
గాంధియస్థికల్ నదులలోఁ గలుపు టెంతొ
హిందుమతము సమాధిపై నెల్లవారు
పువ్వులమాల లుంచుటయుఁ గ్రైస్తవమతంబు.

పోవుచుం బోవుచును నేర్పిపోయె బ్రిటిషు
వాఁడు మా నూత్న దేశీయ పాలనులకు
రేషనింగును లాటిచార్జియును నంది
పొందని జవాబులును ప్రశ్నములకు సభల.

మగువ బిడ్డలు నీదు రోమయ్యగాండ్రు
తలఁప నులిపిరి కౌగితంబులు నయంబు
కాంత యెనిమిదిమాసాల గర్భితైన
కాంతునిఁ గన్నుగిలిపెడు గదినిఁజూచి.

పృథివి దేవుఁడులేదు చూపించు మందు
మనము దేవుళ్ళ మే మఱి మనసు మనము
నైనఁ గావున్న భార్యల కైన నిప్పు
డైనఁ గావున్న మఱి చచ్చినప్పు డైన.

ఒక యధికారికి "సప్లై"
ప్రకటిత నిశేయందుఁ బంపఁబడు వస్తువులకు
"తకతై తక" తన కూఁతురు
ప్రకటా ప్రకటముగఁ గానఁబడె నట కంటే.

వరుస వావి లేదు వర్ణమ్ము జాతియు
లేదు మంచి చెడ్డ లేదు సువ్వో
వయసుమాత్ర మొకఁడు పాటింపఁబడు చుండె
నదియు పెండ్లి చేయు నవసరమున.

మన మిద్దఱమును దారిం
జనుచుండగ నిన్నుఁజూచి శ్వానము మొరుగం
గను నీకె తెలియవలయును
తనరగ నీలోన దొంగతన మెట్టిదియో.

బావా! నీ కూఁతురు నా
పై వేసెనుకన్ను చంకపట్టుక దిగదే
చావమొ మరునకుఁ జనుఁబా
ల్ద్రావువయసునందె యింత దగ యుండినచో.

విస్తరిసి నిష్ట మగు కూరవేసి పొంగు
లారు నన్నమ్ము వడ్డించు మనుము చూడు
మపుడు మామ సంధ్యావందనాది జప ము
సాధ్యమై పర్వులెత్తు పంజాబుమైలు.

నాకు నొకట్టికట్టును నీకు నొకడ
యేమి యన్యాయ మనఁగ "నా సామి" యనియె
నాకు నారాన్నులే మరి నీకు నారె
నాకు జరిగినయట్టి యన్యాయ మెంత.

స్కూలు ఫైనలు ప్యాసైన సుదతి కేమొ
భర్తగాఁ గలెక్టరు గాని పనికిరాడు
ఈమె బి. ఏ.; వివాహ మింకెట్లు జరుగు
ఈప్సితులు లేనియట్టి యీ కాలమందు.

మీ యుద్యోగి యొకండ
న్యాయమ్ముంజేసెఁ జూడు డని మొఱవెట్టన్
మా యుద్యోగియు మఱి య
న్యాయ్యంబును చేసె నందువా యని తన్నెన్.

పిల్లికి బిచ్చము పెట్టని
యిల్లని పదిమంది యనిన నేమి ఫలం బా
యిల్లతని దాతృతాగుణ
మెల్ల నగని రావుబహాద రిచ్చిరి కాదా!

అసలె శిష్యసంచార మంతంత యయ్యె
నందులోన నూరూరను జందెములును
వేసి బ్రాహ్మణు లగుచుండ విప్లవంబు
జతనుపడె విశిష్టాద్వైత మతమునకును.

మా వారికి రైల్వేలో
నే వెసిలిక లేదు రాతి రెల్లను పనియే
మా వాడ దొంగభయమును
నీహో బలశాలి వుండి నిశం బోరాదే!

వానిఁ జంపినాడు వానిభార్యను తన
పడతిఁ జేసికొనియెఁ బుడమిఱేడు
ప్రేమ యనుచుఁ గవులు విరచింప గీతాలు
శిల్పిజాతి రాలు చెక్కినారు.

ధరణిపతి చేయు ఘోరకృత్యములు చూచి
పరమ మైన ప్రజావిప్లవంబు జరిగెఁ
గొంత జరుగ, విప్లవనాయకుల నొకండు
వట్టి రా జేమి టని చక్రవర్తి యయ్యె.

పలుకుబడియు నధికారము
గలవారికి నెంతమార్పు కలిగిన నైనన్
జలిచీమ యైనఁ గుట్టదు
తలక్రిందై ప్రళయ మైన ధారుణి నెల్లన్.

విదలింపఁడు చేయి ప్రభువు
విదలించున యెవఁడుగాని పేద యడిగెనే
నిది కలికాలము కావునఁ
బదిమందియు సంఘ మడుగ వంద లొసంగున్.

మరియాద గలుగు పిండుల
మరుఁడు తిరుగుఁదండ్రియింట మాదిరిగానీ
తిరిపవు గాడిదకును నా
మరుసిం గని యోండ్రపెట్టి మఱఁగుట పనియా

పైని డేగ డైవు బాంబింగు చేయుచో
క్రిందఁ దల్లికోడి ఱెక్కఁ జాచు
పిల్ల రెండుఁ బిల్ల జెల్ల చేరఁగ "ఆంటి
ఎయిరు క్రాఫ్టుగన్ను" ఎద్రిచె ముసుఁగు.

పగిలి చను ప్రత్తికాయల పాటికాక
అల్ల మిణుగురు పురువులయంత లేక
విదియచందిరు వెన్నెల చదల నెక్క
నల్పకవి దైనయట్టి కీర్త్యాశపోలె.

బ్రాహ్మణ బ్రాహ్మణేతర భావసంధి
నశతఁ బ్రాణాలుపోయెడు వార లెవరు?
అచటఁ నచట ధనమ్ము లేనట్టివారు
అట నటఁ గులమ్ము వోట్లు లేనట్టివారు.

వాఁడు సప్తాహములు చేసి మేడకట్టె
వీఁడు నుద్యోగముం జేసి మేడకట్టె
వాఁడు దొంగయటంచును వీఁడు, నరక
లోకమేఁగు వీఁడంచు లో లోన వాఁడు.

పత్రికల నీవు వ్రాసెడి వ్యాసములను
చూచి శృంగారభావమ్ము చూరగొంటి
వని తలంచితి దయచేయు డయ్య యింక
మీకడఁ భావ "మర్థషలాసు" లేదు.

ఈ పాడుసినీమా కథ
లీ పత్రికలందు కథలు నే నమ్మితి న
య్యో పాడుచేసికొంటిని
కాపురమును చేతఁ జిప్ప కట్టియు వచ్చెఁ.

తెలుఁగుదేశాన యువకులు త్రిదశు లైరి
మొట్టమొదట శాస్త్ర పురాణముల నిరసన
పైన దేవుఁడు లేడన్న పట్టుదలయు
సూటిగాఁ జిట్టచివరకు సోషలిజము.

సరదాకు వేటలాడును
బొరియలలో నక్కి చిక్కఁబో దని నక్కఁ
బొరిఁజిత్తులమారి యనుచు
పిసచించెను మనసి; క్రూరవిధ మిది యగుఁచో.

అడవి యుద్యానముం జేతు రనుచు నీవు
చెంద నేల ముదంబు కసింద మొక్క!
నినుఁ బెరికి ప్రోవువెట్టి యెండించి యెరువు
చేయ కున్నను జాలు నీ జీవితంబు.

అంటఁబోకు మొక్క గవర్నమెంటు మాత్ర
పడను దిట్టుము నీ యిచ్చవచ్చినట్లు
కొంచెముగ నొట్టిగా "సెన్సు"కూడ కలుపు
పత్రికల యమ్మకము నా జవాబుదారి.

చెలఁగి నీకును కీర్తి నార్జించునట్టి
ప్రతిభ లే దొక్క చక్కనిబాట కలదు
శక్తిగలిగి యెవ్వఁడు ప్రతిష్ఠకును నెక్కు
వానితో నీవు పత్రికావైర మూను.

ఎత్తు గిలకబావి యింతి నీరముతోడు
రాజు చుండె ప్రాయ్యో రైక లేదు
ప్రియుఁడు కెలన నిలచి వీక్షించు చున్నాడు
పడతిచేద నూత వదలివేసె.

కరవఁబోవుచు నున్నట్లుగా నటించు
కోరలం దింపకయె మెడల్ కొరికికొనును
వైరముం బ్రేమ యొక జాతిభావము లని
వ్యాఖ్యచేసెడు శునకము లాడుకొంచు.

మంచమునుండి కోపాన మగువ మాటి
మాటికిని లేచి పోవఁగా మగఁడు తాను
రాత్రి, మంచమ్ము కుక్కిగాఁ ద్రాళ్ళకోసె
పడతియును లేచిపో సులభంబుకాక.

తిండి లేనట్టివారికిఁ దిండి యిడడు
తిండి కలవారిదగ్గరఁ దీయుఁబన్ను
ఉర్వీపతికంటె దంతవైద్యుండు నయము
పన్ను కట్టును లేనట్టివాఁడు చనిన.

పువ్వుటమ్ముల పొదివోని నవ్వు ఫాలయ
నడిగితివ యేని నే బదు లాడలేను
వ్రాసి యిచ్చెద నీదగు వర్తనంబు
మదియుఁ గలదేని నీవుగాఁ జదువుకొనుము.

అత్తా! చూచుచు నవ్వెదు
గిత్తవలెఁ నీదు కొడుకు కేరడములు పే
ఔత్తి మితిమీరు చున్నా
డుత్తది నన్నన్న లాభ ముండదు పైనఁ.

పగటి గృహాభారవశతఁ గోపంబు నూను
శ్రమభరాలసయై మలుసంజవోలె
మఱియుఁ గులకామిని నిశాప్రమాణముగను
మెల్లఁగఁ బ్రసన్న యగును జాబిల్లివోలె.

వట్టియాశతో నేమి లాభంబు; కీర్తి
కాంతఁ దార్తురు పత్రికాకాంతలు కవి!
నమ్మ వేసియు మఱి దేశనాయకులను
పోయి యిద్ది యబద్ధ మేమొ! కనుగొనుము.

బోట్లకాలువ, రెండువైపులను గలవు
గ్రామములు, స్నాన పానముల్ కాల్వయందె,
తెరలి మన్మథుఁ డచట వంతెనలు కట్టు;
కోర్కెమెయి జలాంతర్గామికూఁడ నౌను.

తల్లి పయ్యెద కదలినఁ బిల్లవాఁడు
లేచుఁ దల్లియె లేచిన లేవ డెట్లు
భర్తకడ సుంత సదురింపఁ బడతి చేయు
నఖిలయత్నమ్ములు సమన్మథార్పణములు.

స్మరదృశుఁడు "కాస్మపాలిటన్" మహిని లేడు
కడగి పూరుషు లంత "బిగట్సు" లేరు
చెన్నపురి కాళిఘట్టపు సీమలందు
తెల్ల "బ్రాథెల్సు"లో నల్ల తెల్ల పోర్లు.

అందటును కోకిలను మెత్తురం చతండు
కోకిలను దిట్టుచును వ్రాసెఁ గ్రొత్తపాట,
యెవరు చెప్పిరో కోకిల కీ విషయము
వానియెలనాగ గొంతులో వచ్చికూయు.

ఒక యలవాటుగ దయచే
నొకనికి నేదేని యిచ్చుచుండుము కొన్నా
ళ్ళకు మానుము మానినతో
నకటా! దుర్మార్గుఁడైతి వా క్షణమున నే.

కడఁగి 'కాన్స్టేబి'లైన నీకంటె నయము
కాస్త మోటారునకును టికెట్టుకూడ
నానునైన సంపాదింప లేకపోతి
నాల్గు నందలు తెచ్చుచున్నావు మఱల.

వణఁకుచుండిన యొకపేదవాఁడు వచ్చి
కరము చాచిన బొమముడిఁ గసరికొట్టి
నప్పుడే "నాఫీసుటాటులు" నందు బొంగ
రాల పిత్రుల మేపి దర్జా వెలార్చె.

మా యింటివెనుక భర్తయు
జాయయు, పిల్లలు నయంబు సగము మిగిలిపో
రేయి యగుదాఁక; గర్భిణి
యూయయ యోఁచేఁట్లుఁ బ్రేమయదికాఁబోలున్.

తన మాతృభాషలోపల
మును చదువక యుండ సంద్రములు నాల్గుపోఁ
శనముంబట్టిన నైనను
జనుసి తెలివి తల్లినేల సంస్కృతిఁ గనునే

వృత్తులు గుణాశ్రయము లని వేర చెప్ప
వలెనె మీ యన్నదమ్ములవంకఁ జూడు
నీ వుపాధ్యాయుఁడవు మాటనేరుపరివి
నీ సహోదరుఁ డేమొ పోలీసువాఁడు.

ధనవంతుఁడు నధికారియు
బొనరించిన చిన్నపనిని బొగడుదు రెపుడున్
ధనహీనుఁడు విద్వాంసుఁడు
పొనరించిన గొప్పపనియు బూజింబట్టున్.

అతనిభార్య పుట్టింటికి నరిగె వాఁడు
వంట చేసికొంచుండెఁ దానొంటరిగను
అంతనే వున్నదే "కూరలమ్మి" లోన
నెన్నికూరలు కొన్నాడొ యేమొకాని.

ఊరిజనంబుల దైన యు
దారత నడిగెదవు పాంథ! తమబావులలో
నీరే త్రావుదు రెప్పుడు
నేఱును బ్రవహించుచుండ నే నీ కెలనన్.

ఎల్ల పెఱచెట్ల చివురాకు లింత మండు
వేసఁగికి నీనకట్టున వెలయు చుండ
దీనికిం జీమ కుట్ట లేదే నెలంత!
మావిచివురు చల్లఁదనంబుమాలు చెప్పు.

ఆయెడ సంగీతోపా
ధ్యాయుఁడుగా వెలుఁగుచుండ నార్నెల లందున్
మా యల్లుస నీ యూరనె
వాయించిరి పుష్పశరుని బాజావాలెన్.

అతఁడు మరి నాస్తికుఁడ నంచు నంత చెప్పి
తనయునకు జబ్బు చేసినతరుణమందు
నెట్టుకోను జ్యోతిష్కులచుట్టుఁ దిరిగె
వేడిమొయి ముట్టఁ జదివించె నాడు వెల్ల.

ఊరిచిత్త నూడ్చు నువిద ముఱుగుకాల్వ
లోనఁ దీసి బురదలోన వెదకు
సర్వజన్మఫలము సంధిల్ల నిటు పుత్రి
మరియు నేమి కలదో, మమత విడక.

శ్రీమంతులు ధీమంతులు
నీ మనుజుల వేరు వేర సృష్టించు విధిఁ
గామించినట్టి శారద
పై మోహము విడిచిపెట్టు పరమదర్శిఁదా!

భర్త "విల్లు"నఁబడి "మనోవర్తి" తినుచు
నూరి కుపకార మొనరించు నువిదవోలె
వేదపురుషుని దగు "మనోవృత్తి" తినుచు
బ్రసవశరుఁ గొల్చు నగ్రహారంబు బడిత.

పెండ్లి పీటలపైన నవ్వింపఁబోకు
చెలియ! నాకు నవ్వాఁగదు చెప్పుచుంటి
పతియెడఁద విప్పుకలిగిన వాఁడో! తోఁచ
కుండఁ దొణఁకక బెణకక యుండువాఁడో?

"అత్త! నీ కూఁతు రది యేల నమ్మ! తాఁటి
యాకుపైఁ గూఱుచుండె సిగ్గైనయట్లు"
"ఎందుకో నాకుఁ దెలియద యీవె పోయి
చిన్నమఱఁదలు పిల్లఁ బ్రశ్నింపరాదె?"

గాజు నిలువుబొమ్మను దేహావర్ణ కలిత
"వాయిలును" గట్టి నిలఁబెట్టె వర్తకుండు
దాని నుల్ల కనుంగొంచుఁ దా నతండు.
కోరచూపులఁ గంచు షోకులనుబోవు.

ఒంటరిగ నిల్చియున్నట్టి యువిదఁ గాంచి
మీఁది యే యూరటంచుఁ గన్మిటి యడుగ
విర విరల మోము గర గర త్న్వదవి బిట్టు
చుర చురల్ కన్నుగా వానిఁజూచె నతివ.

నల్లకుక్కఁ జేతుఁ దెల్లకుక్కగ నంచు
సబ్బుపెట్టి యొకఁడు జమురుచుండ
నెవఁడో నవ్వె నొక్కఁ డేల కాకూడదు
మానరాదు యత్నమైన ననియె.

మేనమామ గౌరీపూజ యైన వేళ
విసుఁగుకొనె "సింకఁ గొంచెము వెడలుపైన
మూతిగల తట్ట తెచ్చిన ముసిఁగిపోవు
నేమి యవ్వారి దైన సొమ్మొల్ల" ననుచు.

వేద శాస్త్రాదులకు రక్ష వెలయుకొఱకు
రాజు లా పూర్వమగ్రహారంబు లిడిరి
ఆ మహాగ్రహారంబుల ననుభవింత్రు
సిగ్గుచెడి వేద శాస్త్ర విక్షీణమతులు.

ఒకఁడు సంధ్య వార్చు డొక్కఁడు కధ్యయ
నంబు లేదు కర్మనమ్మకమును
సిరియు సమముగాన చెడియె బ్రాహ్మణు లందు
నొక్కశాఖకంటె నొకఁడు గొప్ప.

కనకదుర్గ నవ్వ్యాలకుఁ బుల్కలుగ వచ్చె
మల్లికార్జున శివదేవు మౌళివీధి
వెన్నెలలు కృష్ణ చల్లనివీచికలను
పూచికలముండ్ల పోలికఁ బొడుచుకొంచు.

కాశిలోన నుద్యోగము కలుగు నతని
కల కుదిర్చిరి సంబంధ మతఁడు వచ్చె
స్నాతకము వేళ మరలఁ గట్నంబుమాట
లేచి నిజముగాఁ గాశికి లేచిపోయె.

పుడమి ము న్నెలితి మటన్న మిడిసిపాటు
ముసలిమాన్లు నియోగులు మొదలుగాఁగ
నిస్వాదుం బడ నాంగ్లేయు లిప్పు డేలు
చుండి పడుచుండి రన్నఁ దప్పెందు నేమి?

కడఁగి కమ్ములు పిండిన గంజిమడత
తెలయుఁ జూపులు కిఱ్ఱుచెప్పులును గలుగు
పెద్దయాసామి, కుప్ప నూర్పిడి కడియము
కుసుమశరునకుఁ బెట్టనికోట యయ్యె.

వానిమొగంబున కది యెపు
డైనను నొకయెచ్చు నైన హంసను నైనం
గానీ చూచెనె? తనసతి
యా నడచెకునట్టి యంద మది యెఱుఁగంగా.

అచటఁ జెల్లె లున్న దక్కఁగా ర్లుండిరి
పట్టపగలు నేను వత్తు నేని
అకట! వార లేమి యనుకొందు రన భార్య
అవును వార లెఱుఁగ రనియె భర్త.

తనకుఁ దెలియనియపుడు పద్యమ్ము వ్రాయు
నెవఁడుకాని మహాకవియే తలంప
తనకుఁ గోరిక లేనప్డు వనములోనఁ
గలుగునన్ని వృక్షమ్ములు కల్పకములె.

ముదిరిపోవుచు నున్నారు పూవుబోండ్లు
పితృగృహమందుఁ గట్నముల్ పెరిగిపోయి
మనకు మతమైన లేదాయె మఱియు వారి
మిషనరీలుగ నెటకో పంపింప నైన.

మొగమునందున సౌమ్యము బిగువు జఘన
మండవిని గల్గినాయమ మగఁడు నూర
నున్నఁ గన్నెత్తిచూడదు చన్నత్రోవ
నతఁడు లేకున్న సుంత కన్నాడుచుండు.

ఇంటిలో దీప మున్న దం చెవఁడుగాని
పండువెన్నెలలో నారుబయటఁ బోడు
పోయినను తప్పె? వెన్నెల పులుఁగువోలె
కాంతిదారాల నిచ్చెన కట్టుకున్న.

బ్రాహ్మణులు పూర్వ మపకారపరు లటంచు
వచ్చి నపకీర్తి యెట్లును వచ్చెఁ గాని
పూర్వబ్రాహ్మణుల్ సంతానమునకు "బ్రిటను"
చేత "లవణుసు" లేకుండఁ జేసినారు.

మొగిలు పట్టినంత ముగుదకన్నుల తుదల్
పులుకు పులుకు మంచు పొడుగుసాఁగ
మేయు చున్న యెడ్ల మెడలోని గంటల
యులివునకును బ్రమసి యులికిపడెడు.

శ్రీమంతు లయి కనకదు
ర్గామోహన దర్శనంబు గావింపఁగ వీ
రేమో సన్యాసు లయి స్వ
ర్గామృతఁ గొలిచెదరు మల్లికార్జున దేవున్.

ఆ రోడ్డున స్త్రీ పురుషులు
జారత చోరతయుఁ జేసి సంపాదింపన్
దారిద్ర్యము తెగకున్నది
హారా! గడ యెక్కు వృత్తి యంత్యాశ్రితమై.

ఓయి! కార్యమునకుఁ బోయెడి మిత్రుఁడా!
ఉవిద నీకు నణఁగి యుండుటయునో
ఉవిద కీవ యణఁగి యుండుటో తొలిమూఁడు
రేలయందె నిగ్గు తేలిపోవు.

అందముగ రాలిపడి ఫాల్గునాంతమందు
దట్టముగఁ బూఁత యీ వేప చెట్టుమొదట
నున్న యిరుప్రక్కబండలం దుదితగంధ
వారణ కపోలయుగమునాఁ బరిమళించు.

చిన్నిసిగ్గులు కొలఁబోసికొన్న వేళ
నిలువు నిలువున స్నేహంబు నిండిపార
నల్ల నేర్చెను మఱఁదలు నావు నేయి
కీలు కొలపోఁత యప్పటి గిద్దఁ జూచి.

క్షితి నదృష్టవంతుఁ జెఱుపువాఁ డెవ్వఁడు
కవికి ముట్టలేదుగాసు పైస
యాసకొలఁది నతఁడు వ్రాసిన కవితచే
ధనికునకును భోజతయె ఘటిల్లె.

మట్టి మోయ నటంచుఁ బ్రాల్మాలిన దని
కోపమున భర్త భార్యనుగొట్టి మట్టి
యంతయును దానె మోసి తా నతివ యన్న
ముం దినద టంచుఁ దా నన్నముం దినండు.

స్రస్తకటిచేలకంచుక, శ్లథకచాళి
యైన నెలనాగ నిద్రాభరాలసాక్షి
తానె వంటిల్లు సర్ది మూఁతలను బెట్టి
దానె దీపము తగ్గించె తరుణిభర్త.

స్వామి! యుండు మన్నఁ బైపైనిమాటందు
నేమి సేతు నట్లె యేగు మన్న
నెఱుఁగలేనె నీవు నిష్టమ్ము లే దందు
వూరకున్నఁ గోపమూరఁ జూతు.

వాని కులమునందు వాఁడె విద్యావంతు
డెంత డబ్బు కీర్తి సుంత కలదు
కులములోని పూరుషులకు దేవుఁడు వాఁడు
వెలఁదుకలకుఁ బూవువింటివాఁడు.

పెట్టిలో నున్న గుఱ్ఱపుతట్టుఁ బట్టి
నులకత్రాఁడు కళ్ళెముకట్టి వెలచె స్వారి
తుమ్మపీకెల నది పడద్రొబ్బె నంతె
యెవరిమాటలో విని పుత్త్రి నేల నెగువ?

ఆమె యొక్క కళాస్థానమధర మయ్యె
నంత వెగటయ్యె నోరు బింబాధరకును
కార్తె కార్తెను మున్నును గాని చినుక
జోసి యాకాశమును గాంచి పొగులు భర్త.

ప్రతిదినమ్ము సాయం సాంధ్యరాగసుషమ
లతని మొగముననే చెరలాడు చుండు
ప్రతిదినము నప్డు వచ్చెడు రైలులోన
నాడువా రున్న పెట్టెను నభిముఖముగ.

ఓరి పిచ్చివాడ! యుర్విలో స్వారిచే
యంగరాని గుఱ్ఱ మంచుఁ గలదె
చెలఁగి యది "హాశాము" చేసిన నైనను
గొంత; తుదకు శాతుకొలఁది కాదె?

తరఁగతులకొలఁది గవ్వ లుం
దురు శర్వాణీమనోజ్ఞ నూపురములు పై
తరఁగతి; మఱి పరమాధమ
తరఁగతి ఖిల్లీదుకాణదారుల మిత్రుల్.

ఇంద్రుఁ డైన గాని యింతటిసిగ్గు తాఁ
బడడ టంచు నెంతుఁ, బడతి యంత
రైక చీర మొదలఁ గ్రమ్మి యున్నవికదా
కోమలాంగి కెందుకో మరంత.

అవనిఁ బెద్ద యుద్యోగస్థు లదొకజాతి
పేదల యదృష్టమును పీక పిసికి చంపి
యస లదృష్టంబె లే దందు రాత్మగోప
నంబుచేయఁగ నెన్నిమార్గంబు లొప్పు.

మనుజు లెల్లరను సమానంబె యందువు
నమ్మనిష్ట ముండి నమ్మలేను
తెలియ నొక్కఁ డొకఁడు తీయు గోతులలోతు
వేరు వేరుగాఁగ వెలయు చుండ.

పురుషులకుఁ దప్పులేదుకా! పొలతి, నేను
కాక మఱి యెవ్వతెయు నైనఁ గలవె యన్న
నున్న దున్నది యనుదు లే కున్న లేద
యనుచు దానికిఁ గోప మే లరుగదేర?

చిలవలు పలవలు నూరక
కలిపించుచు నేల పలుకఁగా? మీకును నా
లలనకు నేమియు లేదని
చెలువముగా నేన మున్ను చెప్పితినిగదా!

అతఁడు పత్రికనుండి యాలకించుచు నుండె
నంచుఁ దెలిసి మొకతె యతనిభార్య
తోడ ననియెఁ "బూవుఁబోఁడి! నీ పతి, పూవు
టమ్మువాఁడు నన్నదమ్ము" లనుచు.

వాఁడు శిశువనియంతవాఁడు కన్నెకట్టే
పెడన యున్న నేమి? బేసి కాదె?
శిశువు మేనఁ గాంత చెఱిసగ మయ్యె స్త్రీ
ప్రకృతి వాని దగు స్వభావమందె.

ఉన్నవారును లేనివా రున్నవారి
కే మొసంగుదు రనుట యదెంత నిజము
మొయిల! మాఁగాణిపై గుండపోఁత యనుదు
చినుకు చినుకవు మా మెట్టచేలమీఁద.

ఆడవారిపిఱుఁదు లగని యూరక యిట్లు
బ్రమసిపోదుగాని బావ! నీవు
నీవు చీర తాల్పు! నీ పిఱుందుల సోకు
నరసి జనము లెంత మురియఁగలరొ!

అటకపై నుండి దూఁకి వాఁ డరుగుదెంచి
సీసయి వసంతముంబోసెనా! పడంతి
ఊరిదేవునకును వసంతోత్సవంబు
జరుగఁగా దేవి కేటికి జరుగరాదు.

రెండు పిడిరాళ్ళు మోసెడి "శాండో"వోలె
ఉవిదయే తాను ముందు కూర్చున్న నైన
బ్రదుకనీయఁడు గుర్రపుబండివాఁడు
వెనుక బరు వంచుఁ దెగ గోలపెట్ట దొడఁగె.

తెలివితక్కువకూడఁ బతివ్రతాత్వ
గుణమునకు నలంకారము కొన్నియెడల
నక్షరము రాదు తనపతి కతఁడు పండి
తుండటంచును దాఁ జెప్పు చుండు నామె.

ఆ యెంతో గొప్పనటునకు
మాయురె! రంగమ్ముమీఁది మాట యటుండెం
బో! యింటివద్దనైత
మ్మా యేకస్త్రీవ్రతంబె యభినయ మయ్యెన్.

శ్రమపడి యొకసారియె యా
దమయంతికి మున్ను హంస దౌత్యము నెఱపెన్
శ్రమ లేక వేయిసార్లీ
దమయంతికి హంసగమన దౌత్యము నెఱపున్.

పిలచె నిన్న మొన్నటి మొన్న నేఁడు, నెల్లి
యును మ ఱెల్లుండి యావ లెల్లుండి చూతు
మఱి యటావలెల్లుండియు మఱలిరాదొ
వనితఁ బుట్టింటినుండి రావలవ దనుము.

ఒడలఁ జెమటపోసెఁ గడు రొప్పు చుంటివి
కొస బుజాన నంటెఁ గుసుమరజము
పడుచుదాని మగడ! నడియెండఁ బూఁచిన
బీరపాదు త్రవ్వ పెట్ట నేల?

రోజు రోజుఁ జెల్లి బూజు పుల్లకుఁ జుట్టి
బూచి యంచు బెదరు పుట్టఁజేయు
చెల్లి బదులు తీర్చెఁ జివురాకు జొంపంబు
అక్క కిపుడు బూచి యంచుఁ జూపి.

ఇతఁడు గాని యప్పు డిప్పుడు పసివాఁడె
చిన్ననాఁడు తండ్రి చేయుచుండ
జపము, తానుగూడ జపము చేసెడివాఁడు
ఇపుడు దొరలఁ గాంచి యిట్లు చేయు.

తెలియదు దానికి లోపలఁ
గల కోరిక వెఱ్ఱిమొఱ్ఱిగాఁ గనుచుండున్
దెలియకను దీనికి నే గతి
ఫలియించునో సంతసుండపగిదిఁ జరించున్.

స్త్రీ లుదుకుచుండ స్నానాల రేవులోన
వయసు రాకుండ నూహాలు వఱలునట్టి
సోఁగచూపుల బాలురు మూఁగినారు
చేరి తరువాతఁ గబురులు చెప్పుకొనఁగ.

పురుషుండు బృహన్నల జుం
జుఱు జుట్టుది మాచకమ్మ సుతుఁడు కలిగె ను
త్తరగోగ్రహణ ఫలంబో
మఱి.యీచుకపోవకున్న మహిమ య దేదో!

ఇంత చదువులేక యేదో 'సిఫారసు'
వలన గొప్పపదవి వచ్చినట్లు
తనకు దేవుఁ డట్లు కనిపింపవలె నఁట
జపము తపము యోగసరణి లేక.

అల్లఁ ద్రుంచి పూజాపాత్రయందు నుంచ
నీ ప్రసూనకన్యకలకు నెంత సిగ్గు?
సన్నఁ దెలిసెను స్వామి యర్చనకె టంచు
నొక్క డొక డత్తుకొని హాస మొలుకుచుండె.

'ఓరి సఖ! నన్నుఁ జూచి యా నీరజాక్షి
మొగము నటు త్రిప్పుకొనియెఁ జిన్నగవుతోడ
'త్రిప్పుకొనవచ్చు నీవు చందిరుఁడ వౌటఁ
జిన్నగవుకాదు మసలించుఁ జెలువుకాని'.

పూవు, చిన్న పసరు మొగ్గ కాకయమున్న
సన్న యీనవోలె నున్నయట్లు.
వలపు, సిగ్గుగాఁగఁ బరిణమించకమున్న
బాల్యమందు భయమువోలె నుండు.

అమ్మమ్మా! నీ చిన్నత
నమ్మన నట్టిట్టు చూచినావా! లేదా?
మ మ్మనెను! కృతయుగమ్మున
గొమ్ములు లే నటువె? ఆలకుం గిత్తలకుఁ.

నట్టు నగుచుఁ బుంజు, చట్టుపల్ పచరింపఁ
గవల దాడుబాత్తు, కామజాతి
పఱచి కూఁతవెట్టి మరియాదగల కోడి
ఱైన లజ్జ నెంత యొందగించు.

బోటు బిడ్డ అల్లె పోటీలుపడి యీమె
కంటె నీమె యీమెకంటె నామె
మగల బొమికలేర, నగలకై; చివరకు
జెలుల పతులు రాగిచెంబు లైరి.

చనుము విటకాఁట! మీవంటి జనముకొఱకె
పరగఁ బెండ్లిండ్లటంచు నేర్పఱచినారు
తమరిసొమ్ము నీవఱకె వృథాగఁ దింటి
నురక మా యింటిచుట్టును తిరుగఁబోకు.

తండ్రి చిననాఁడె చసిపోయెఁ దలలు మార్చు
మేనమామకు "మేనేజిమెంటు" నచ్చె
నల్లునకు నిర్వదేండ్లకు నధిక మైన
వీలులేదు "మైనారిటీ" వెళ్ళె ననఁగ.

ఆ మహారణ్యమందు దావాగ్ని పుట్టి
యామినీవేళ వీచెఁ దీవ్రానిలంబు
జాతిసంజ్ఞలు చెడి లింగసంజ్ఞ మిగుల
నాడసింగంబు దుప్పితో నభిగమించె.

కోయ్యాలీ! నేను నీ డబ్బుతోడఁ జదివి
యకటా! యిట్లు నీ భర్త నగుటకంటె
వానివలె సన్నుఁ జదివించి భర్త నేమొ
కాకయుండిన నెంత సుఖంపడుదును?

వానిగడ్డమ్ము పెరుగుట వానిదైన
యట్టి వ్యవహారసాహచర్యము; మునసబు
కోర్టు, సబుకోర్టు మఱియు హైకోర్టుదాఁకఁ
జెరిగి పెరిగి హఠాత్తుగా గొరుగు డయ్యె.

వాసి కవనమ్ము వాఁడును వాలిసాను
చెట్టయెడుపులు చేసి మా చిన్నదానిఁ
బాడుచేసినయది కాక పద్యములను
వ్రాసి మాకథ యూళ్ళపైఁ బంపు నంట.

జంటగిరులవెనుకఁ జంద్రోదయంబు కాఁ
బోవు నాకసంబుపాలు పెసంగె
నెఱ్ఱపునుగు గలిపి యేన్గుదంతపుఁ బోడి
తీర్చు శబరి కంఠదేశమట్లు.

నూటయిరువది నంబరు నూలుదైన
రంగుచీరయే చాలును! రమణి మిన్న
తెల్లచీరను దాలిచి తెరువువెంట
దెస్కుగాఁ బోవుచుండె "నూడిస్టా!" యేమొ!

క్రొత్తభార్య మగనికొఱకు గంజియు బువ్వ
కులుకు నడలతోడఁ గొంచురాఁగ
దున్నుచున్న మగఁడు దూరానఁ బ్రియఁ గాంచి
మిగిలినట్టి చెక్క మిగులఁబెట్టె.

కాలేజీలోఁ బదుగురు
బాలికలను నామె యొకతె పాపము గోలాం
గూలము తక్కినవారలు
కౌలేయము లామె చదువు గట్టెక్కింపన్.

“బడికి నేను బోవఁ బ్రతిదినంబును నన్ను
వెంబడింతు వేల? పిల్లవాఁడ”
“బడికి నీవు పోదు, బడిదాఁక నేఁ బోదు
నన్ను నడిగినావె? నన్ను నడుగ.

ప్రన్న తేనె యేరుపడని చిన్నరిమొగ్గఁ
గదిపి పారిపోయె గండుతేఁటి
తోఁటమాలి దాని దోరింపఁ దిరిగినఁ
బ్రోడ పూలు దాఁచె ముకుళములను.

పిల్లి పీఁచరకాయలుఁ బేర్మి నూఁచ
బియ్యమును, బాడుకొంచును బెద్ద యన్న
దిన దినమ్ముఁ బొలమునుండి తెచ్చు నంట
వట్టిచేతుల నింటికి వచ్చు నేలో?

ఆమెజడ దీర్ఘముగ నుండ నతఁడు వలచి
తెఱవఁ బెండ్లాడుదాఁక నిద్రించలేదు
పెండ్లి తరువాత, సవరముల్ విలిచి తేఁగ
నింతి యాతని నిదురింపనీయలేదు.

ఎ న్నెన్ని దార్లో? మూసిన
ద న్నన్నియు నామె; కూఁతు నాసను వనరున్
ము న్నన్ని విటులు చేసిన
సన్నగడలఁ దొల్లి తా నుపాధ్యాయకదా!

పలకయు బలపమ్ముం గొని
తలవంచుక వ్రాయు చున్న తనయుని తలయే
పలకపయిఁ గలదు; తెలిక
న్నులకొసలవి తండ్రికాళ్ళనుం గనుచుండెన్.

దేవుని పూజార్థముగాఁ
బూవులు తెచ్చితివి సగము పూవులు వలపుం
దేవేరి కట్టిపెట్టితి
భావకవుల సగమునంత పట్టెను నీవున్.

నిజము, నీ వన్నయట్లుగా నీకు కైత
వేదమే, వేదమం దెంత వేధ కలకు
కామయజ్ఞాస కభిచారహోమములకుఁ
దగిన యర్థర్పలు యజుస్సులుగ వెలుంగు.

ప్రాణములకు లోపలిదగు
ప్రాణములో నున్నవలపుఁ బైదలి యిట్లుల్
మేనునకును వెలుపలిదగు
మేనునఁ బచరించి వాసిమిత్రికిఁ దెచ్చెన్.

అతఁడు, భార్యవిటుని, యందంబు, తెలివియు
జదువు చూచి యెంతో సంతసించు
జనులయందుఁ బుణ్యాజనుల 'కేటాయింపు'
వినఁగ మున్నె చెప్పె వేమయోగి.

ఒక్క యెఱ్ఱగన్నేరొక్క! మందారంబు
దాని తాత, యనకు తావిమాట
జగతి నెంతమంది? జాలి యుండదు కాని
పొంగుకోప మన్నఁ బుట్టకోలఁది.

ముగుద! తీయను! గుండ్రని మొగమునకును
బ్రక్కపాపట యందంబు పట్టి యియ్య
దిలకమచుకొని పెడచార, నెసఁగు పండి
నెరసినారింజను రసజ్ఞ లేరికొనరు.

పరమసుకుమార! నల్లులబాధ హెచ్చు
మా గృహంబున, బ్రక్కింటిమగువ, ముసలి
దైనఁ బడుచుదనమ్మున హాసుకత్తె
సన్నపారుది తృణమైన సంతసించు.

కావ్యములలోనఁ గలుగు వ్యంగ్యముల నెల్ల
మాట మాటకుఁ బట్టించి మగువలందు
బావ పడిన యిబ్బంది, తత్పఠితకావ్య
ముల రసాస్వాదనాసుఖంబులకు రాదు.

ఇద్దఱు మిత్రులు తొలి శే
ముద్దియలం గలసికొన్న ముచ్చట లాడన్
బొద్దయిన, జరిగి రొద్దకు
నొద్దకు నూహాలబలంబు లూరించినటుల్.

వాని బందుగులందున వానిబావ
గ్రుచ్చుకొని కొంచెముగఁ బైకివచ్చినాడు
బావకు 'ఫొటో' సమస్తమా భావములను
నీతి, సంఘమ్ము, కవనమ్ము, నిఖిలమందు.

చిన్నసందు వేఁపచెట్లిరుప్రక్కలను
పూఁత వగరు తావి బుగులుకొలిపె
కులము, గర్వరేఖ, వెలయుఁ బ్రాహ్మణాంగనల్
కోసమాపు లొలయఁ జేసినట్లు.

క్షత్రియుల విజ్ఞైనగర భూజానులందు
నల్ల బొబ్బిలి మున్ను శౌర్యంబు నెఱపె
నౌర! బ్రాహ్మణుల "సినామదారు" లందు
నేఁడు బొబ్బిలి మఱి రాజనీతి నెఱపె.

అట ననార్యదేశంబులయందుఁ గొంద
ఱార్యుల మటంచుఁ బెఱల సంహారమాడ
ఇచట నార్యభూమిని గొంద ఱితరులందు
ద్రావిడుల మంచు సాఁగింత్రు దండయాత్ర.

అస్వాతంత్రదేశంబును నద్దెయిల్లు
తెలియ నొకదాని కొక్కటి తీసిపోదు
ప్రాణము సుఖంబుగా నుండ బ్రదుకరాదు
శాంతకాములు పెద్దలు చావరాదు.

కూలితట్ట నెత్తిన వేసికొని చనంగ
మున్ను, వెనుక మామ సరాగములను వినఁ
దట్టనిండుగఁ దెలినుర్వు తెట్టెకట్టె
చాన చిఱునవ్వు తెలిబులాకీని దాఁటి.

పల్లెటూరివారు పదిమంది యువతులుఁ
వెంటఁగొంచుఁ జన్నపిల్లవాఁడు
సంబరంబునందు సగముచచ్చి చరించెఁ
దాను వారిమనిసె కాసియట్లు.

డాబుమెయి నెంతో "యడ్వరటైజుమెంటు"
చేసినను వాఙ్మయంబునఁ జిన్నమంత
మళ్ళకుండుటచే "సినీమాను" జేరి
గుస్సు మని వాఁడు వడ్డితో గుంజుకొనియె.

పక్ష నిర్ణయంబు పద్ధతి సరిలేద
యువిద! నవమిమొదలు నవమివఱకుఁ
బక్షభేద మేరుపరచినచోఁ గృష్ణ
పక్షభావ మెంత పదిలపడును.

నీచేఁ బనిచేయించక
నీ చేసినచేఁత బరిగణించదు మేలం
చే చనవు కృతజ్ఞతయును
దోఁచఁగనీ దదియసువ్వొ దొరతన మనఁగా.

బడిఁ గులాఁచారమునుబట్టి ప్రాఁతనగలు
పేర్మి బొమ్మకు రంగులు వేయుగాని
తానుమాత్రము నేఁటికాలానికైన
"ఫ్యాషనే" పోవు నీ ముచ్చివాండ్రపడుచు.

వయసుచే మిన్ను మన్ను కన్పడనిదాన!
అనుపూర్విగ వచ్చెడు నాముదంబు
దివ్వెపెట్టుమ! యెక్కఁడో చివ్వపుట్టి
ఆరు నూనెలకై యంగలార్వఁబోకు.

బిట్టుసడిరేయి వీఁచెడు వెఱ్ఱిగాలి
ఆకసమునందుఁ గార్మబ్బు లావరించె
ఒంటరిగ వచ్చెదరె తమవంటివారు
సందు చెడ్డదిగద! ప్రతిష్ఠానిధాన!

డాక్ట రిచ్చెను ప్రాణముల్ డాక్టరునకు
మఱల నిచ్చుచు నున్నది సరసిజాక్షి
ఆతఁ డీయఁ దొలినాఁటి ప్రాణములకు
హక్కుదారుఁడు తా నేల నటమటింప.

నదిని మలుసంజయెఱ్ఱన నలుపుతిరిగెఁ
బల్లగాఁ జల్లగాఁ డోలెఁ బైరగాలి
యపుడ నిదురను మేల్కాంచి యావలించి
పడతి, తా నాడుపులివోలె బయలుదేరె.

అతఁడు నే నిప్డు చచ్చిన నతనిభార్య
వలెను నడుగుకతినదు నా భార్యగాను
యున్న యుద్యోగమున కెంత యుదరిపడియె
నతఁడు పండుగమామూలు నడిగినంత.

సకియ! నా భార్యకును బిల్లలకును ద్రావ
గంజి దొరకెను నీ భర్తకరుణవలన
నీ సుఖంబున కేమిలే! తీసివేయఁ
బోకువే చాన! మా నోటి ముందుకూడు.

నా తెల్లనిమైతీవకు
మీా తిలకము, చీర, రైక మేలా? కుహనా
చేతోజన్మూడ! నాపైఁ
బ్రీతిఁతొలంగకు, వికారరీతిగ నున్నన్.

భార్యతోఁ బ్రియమాడుట పరమమిత్రు
తోడఁ గష్టసుఖంబుల నాడ వెలితి
పడుట యను వానిసృష్టించి బ్రహ్మ సంత
సించె వే యొకబ్రహ్మ సృష్టించి తినని.

ప్రియముగ లోపలిరాతికి
రయమున నిలఁబడు జపాను రబ్బరుబొమ్మల్
నయముసుమీ! మనుమరాలా!
అయయో! నీ కొడుకుకన్న నాలోచింపన్.

"నన్ను నా కిత్తు నన్నారు మున్ను చెలియ!
యెందుకో మఱి తప్పిపోయినది గాని"
"ఎందుకో యేల? నీ వన్న వేను చెల్లె
లను మఱి పూర్వజన్మమందుననో గాని".

అతనివలనఁ బూర్వమ్ము సాహాయ్య మందు
వార లొక్కొక్క డొక్కరూపాయి నొసఁగ
నుండ దీ వేమి: కాని కూర్చుండినారు
చెట్ల నెక్కి వారలు: వాని చేతిచలువ.

గర్భముననుండి పడి రాలుగాయపోతె
మునుపు విస్తళ్ళు కుట్టి జీవనముచేసెఁ
గదుభయము; పోవు నని రాలుగాయతనము
నేఁడు విస్తళ్ళుచింపి మండించుఁ బదవి.

అతనియుద్యోగమున కెప్పుడైన సుంత
ఒడిదుడుకు వచ్చెనే నిలువెడలుగాని
ఆతనిభార్య: లేకున్న శుద్ధాంతవాసి
నంతతీవ్రత పెఱసతులందు లేదు.

పదిమంది యొక్కఁద్రోసిరి
యెద న్యాయమైన కోపమేఁ జెడి వానిఁ
గదలించిరి ముందునకును
నోదవిన దుర్వేళ నిషధయోగ్యులు వారల్.

వాఁడు తనభార్యమీఁది కోపమ్ము నెల్ల
పాండవుల భార్య ద్రౌపదిపైనిఁ జూపి
నధికముగ నేమిచేయు: శౌర్యంబు చచ్చి
మాన మూడ్చిన దగు జాతిలోనఁ బుట్టి.

"ఐయిసు లాండు" దేశస్థుఁడు నలరుతోఁట
కేఁగి మందారము గులాబి యెఱ్ఱగన్నె
రరసి యన్నియు నొక్కటే యంచుఁ దలఁప
నాసపైఁ గోప మేల విద్వాంసునకును.

ధన మధికారము చదువును
దనరినయెడ గర్వ మున్నఁ దగునో తగదో
ధన మధికారము చదువును
దనరనియెడ గర్వ మున్నఁ దప్పక తగుఁబో

వారి యింటను గ్రొత్త దైవతము లరుగు
దెంచి ప్రాఁతవారల త్రాళ్ళు త్రెంచినంత
నింటిలోఁ ద్రాళ్ళు తెగినట్టి యింతు లుండ
వారు వీరును జతకట్టినారుసుమ్ము.

ఆ యూరిలోన దారిం
బోయెడి యేనుఁగులఁ గాంచి మొఱుగుచు నున్నం
బాయక కుక్కలు నవ్వుచు
నా యూరిజనంబు పెంతు రఁట వానిబలే!!

మిషనరీలు రైల్వేవారు మేటిపత్రి
కలును పాలించు చున్నారు తెలుఁగుభాస
తురకలును సినీమాలయింతులును రేడి
యోచతురులు తీర్తురు తెల్గువాచకంబు.

తండ్రి! చదువులకై పరస్థలము దూర
మరుగు చుంటివి! యిదిగాని మఱచిపోకు
పేర్మిఁ బ్రాణముల్ నీ పైని బెట్టికొంటి
మేను ముసలిని నీభార్య తేనెవాక.

దారి నడచుచు ముందుకుఁ బారఁజూడ
నెంత రమ్యంబుగా నుండె నీ స్థలంబు
ఇటకుఁ జేరినతరువాత నేమి కలదు
ఇతరదేశంబులంబలె నదియు నంతె.

మా యావిడ పుట్టింటికిఁ
బోయెడు నెలనాళ్ళలోనఁ బాలతీ! నీవుఁ
మా యింటికి రాఁదగదా!
మీ యింటను మదనుఁ డిట్లు మిడుకుచు నుండున్.

అయ్యో! యీ దీర్ఘవిరహిణి నాదరింపఁ
బోదువా? యేమి? యచటికిఁ బోయి యీవె
మోము చిక్కినచందురుఁ డామె కనులు
నరవిరియుఁ గల్వపూవులం చనకు బాబు!

ఎప్పటిమాటయొ దెప్పెద
విప్పుడు పదియేండ్ల మీఁద నెప్పటికపుడే
కప్పెదు నెరసులఁ దేసియ
దొప్ప వనుచు నెంచినాడఁ దొయ్యాలి! నిన్నున్.

అతఁడు "నార్మాషియరరు" నాట్యమ్ము చూచి
వలచి, యింగ్లీషు నొలికించి వ్రాయు వలపు
గమ్మలకు జవాబుకొఱకుఁ గాళ్ళు గురుసు
వారఁ దిరుగుఁ దపాలాకచేరిచుట్టు.

పొట్టివాసనిఁ గోసి పైకి నెట్టుచుంటి
వెంత నెట్టిన వాఁడు పై కెక్కఁగలఁడు?
తనకు నక్కఱలేనట్టి తాటిపండ్లు
నెవఁడు తాఁ గోసికొన్న నీ కేమి స్వామి!

వ్రాసె నొకకొంటె "నోబెలు ప్రైజు" వ్రాసి
కిత్తు రని యీ యుగాదికి నే విమాన
మరుగుదెంచినఁ దనకోస మంచుఁ జూచు
"ప్లేను" దిగుటకు "డ్రోం" మైన లేని యూర.

మంచెమీఁదనుండి మంటిచెడ్డలు వడి
సెలను బెట్టి పిట్ట సెలగు పెదుచ!
వదలఁబోకు నేలపాలుగా బెడ్డను
మీ పొలాలవైపు రేపు రాను.

ఓసి మొదటిబండ! యుదయాద్రియును నీవు
నొక్కచోటఁ గూడి యున్న నైనఁ
గొమ్మతోడ దీటుగొని మాటలాడకు
ఖచరు లైన నవ్వఁగలరుగాని.

వలపు గలుగు ననుభవం బది వేఱును
వలపులేని యనుభవంబు వేఱు
ఆటవికులు తేనెగూట మంటలుపెట్టఁ
గొనుదు రల్లఁ దేంట్లఁ బెనుచువారు.

తరుణి నిండుచూలాలు నోదార్చఁ బతిని
"నాకు నోపిక లేదాయె, మీకు మీరె
ప్రక్క పరచుకొందురు నాకు వక్క మడచు
కొంద్రు వీవనతో వీచుకొందు" రనుచు.

వేదపురుషుఁడు నన్ను లోభి వని తెగడెఁ
గావ్యకర్త నిను దాతవుగాను బొగడె
అగుణము నధర్మమును మేఘమా! కృతాన
గలిసి గుణమును ధర్మంబుగాఁగ మారు.

అధిక శక్తిమంతుఁ డాశ్రయింపడు వేని
నల్ప శక్తిమంతుఁ డాశ్రయించు
నాశ్రయింపకున్న నమరవు పదవులు
పదవి కలుగువాఁడె ప్రభువు నేడు.

జనులు పరభాష చదివిన
విసగమకములేని యూహావీధుల వెంటం
జను వారి వాదవైభవ
మనలముచేఁ బ్రేమ దీప్తమగు నన్నట్టుల్.

ముష్టికవి తాటియాకు చప్పాళ్ళు చూచి
రాజకీయాధికారి సారస్వతంబు
నిగ్గు తెలియని యట్టి కుందేలు బెదరి
వెసఁ బ్రయాణము కట్టె జాబిల్లిదాఁక.

నీ మొదటిభర్త పైనను నీకు వలపు
పొందియుండెనా యని పునర్భువును గోర
అతఁడు చనిపోయి నాతఁడు పతివి· నీవు
బ్రతికి యుండితివేమి టీ ప్రశ్న యనియె.

హరుఁడు తన భార్యచేతఁ గృతార్థుఁడయ్యె
నట్లె యింగ్లీషు చదివెడు నట్టినీతి
హరులు భార్యలచేతఁ గృతార్థు లగుదు
రల్ల మామలు హిమవంతు లగుచునుండ.

ఆ యందకత్తియం గనఁ
గాయజమతి కోరచూపుగాఁ "గమ్యాని
ష్టా"యమ వాసిని శునక
ప్రాయముగాఁ జూచె హాస్య భావనపొంకౌఁ.

పశ్చి విలుకాని సంతగఁ
జొచ్చెదరా వెలఁదిఁ బగలుమూచినఁ గలలో
వచ్చెడు నాతఁడు మిక్కిలి
సచ్చరిత యటంచుఁ దలఁపసాఁగెను మదిలో.

క్రొత్త శికమారు తొ్రిడుతోఁ గోడెదూడ
క్రొత్తపుట్టిన లాఁగుతోఁ గోడుకు కు్ర్ర
చిమ్ముకొని నేలఁబడి మన్నుచేసి కొనఁగ
రైతు రెండు రెండంటించె లేఁతగాఁగ.

భరతదేశాన మున్ను కొందఱు తపస్సు
చేసి ఋషులైరి నేడు మాసీమయందు
ఇంగిలీసు గ్రంథమ్ములు సట్టె చదివి
అట్టి బ్రహ్మర్షు లగుచుండి రద్భుతముగ

క్షితిని బ్రాహ్మణ ధర్మంబు చాడె నటంచు
జ్ఞానసురుఁ డతండు దుఃఖించు సభలయందు
మెడను జందెము లేనట్టి కొడుకు జీత
మెప్పు డభివృద్ధి యగునని యింటియందు.

ఒగి సిఫార్సు జాతి కుద్యోగము లొసంగ
నీతి చచ్చుఁ జచ్చు జాతిశక్తి
జాతిశక్తి చావ స్వాతంత్ర్య మిన్నాళ్ళ
నిలుచు నన్నయట్టి నియతి లేదు.

కల్లుత్రాపుట తప్పును గాఫి త్రాపు
టొప్పు మరి వార కాంతలు తప్పును గుల
కాంతలొప్పునుం గులవృత్తి యద్ది తప్పు
మహిత మగు నిరుద్యోగ సమస్య యొప్పు.

ఐహిక స్వర్గలోక సౌఖ్యములు తెచ్చు
కవి వలపు, నన్నుఁ బ్రేమించుకాంత నతఁడు
డబ్బుగలయట్టి పెద్ద ప్లీడరుకుఁ దార్చె.
నంత నాపైన విరహకావ్యంబు వ్రాసె.

బడలి తల్లి లాగుబండితో గుర్రపుఁ
బిల్ల పరుగువెట్టు నల్లజాతు
లెచటి కేగుచుండె నెఱుఁగని పాశ్చాత్య
నాగరకత వెంట సాగునట్లు.

నేటికాలంబు నందుఁ బండితుఁ డెవండ
నంగ సుప్తిఙంతముల చందం బెఱుంగ
కున్న యాతఁడు పురుగులు తిన్న తాటి
యాకులను లెక్కపెట్టెడు నట్టివాఁడు.

ఎంతో బ్రతికిన నింక నాల్గేండ్లు బ్రదుకు
నట్టి తనదైన పదవికై యాత్మ దేశ
మొక సహస్రాబ్దిగాఁగ బంధకిగఁ జేయు
వాసికై క్రొత్త స్వర్గనిర్మాణ మొప్పు.

తినునది గడ్డి, మరిం దము
చనునది యొయ్యార మేమి జంతువులు ధరన్
తన యలుపపు టధికారము
జనునకు నదియెంత వ్యర్థశౌర్యము తెచ్చున్.

ఆ మహారాజుదగ్గర నతని కున్న
పలుకుబడి యెల్లఁ బున్నెము పండినట్లై
ఎంతమంది పేద కులాలయింతు లతని
పూలమునఁ గాంచిరో రాజభోగములను.

తననుఁ బై యధికారి పాదమ్ము లొత్తు
నతఁడు తనక్రింది యధికారులందుఁ బ్రళయ
రుద్రుఁడగు సూర్యపాద సాంద్రుండు చంద్రు
డల్పనిశలందు విరహిణులందు వహ్ని.

అసలె దిగనారిపోయిన యాంధ్రభాష
నా మహానుభావుండు విద్యాధికారి
యై మరిఁక మరియును దిగనార్చె నట్టి
నేరుపే వానిపదవిని నిలువఁబెట్టు.

పరుల కుపకార మొనరింప స్వర్గసుఖము
సంభవించుట యద్ది సంశయ విషయము
వేని కుపకృతిచేతువో వానివలన
నీవు గడ్డిని గరచుట నిశ్చయంబు.

ఏ పద్యమ్మున కదియే
యీ పంచశతీకవిత్వ మీయెడ నెచటన్
యాపి యొకించుక యూహా
వ్యాపారముచేయు మర్థ మందుకొనంగన్.

